శ్రీ

# పీఠిక

శ్రీ సీతారామమూర్తిగారి కవిత స్వతంత్రమైన మాధుర్య సౌరభ్యములు వెదజల్లఁగలది. సౌలభ్య గాంభీర్యములు దాని మూలద్రవ్యములు. వారి నెఱుఁగని వా రుండవచ్చును; గాని వారికవిత నెఱుఁగని వారు తెలుఁగునాట నుండరు — అనఁగా సాహితీ రసికులలో నన్నమాట. ఎవ్వరైన నుండిరా వారిని దైవవంచితు లనవలయు నంతే.

కవులనుగూర్చి యీయన యీ 'సర్వోదయగానము' న చెప్పిన పదునెనిమిది చిన్నపద్యములు కవితా వ్యాసంగమునకు దిగిన వారందఱును మంత్రములుగా జపింప వలసినవి. అందలి యర్థ భావములు శ్రీ భావే మునీశ్వరునివే కావచ్చును. కాని వానిని జీవరత్నములుగాఁ దీర్చి యందిచ్చిన పుణ్యము శ్రీ సీతారామమూర్తిగారిది. దాని ఫలము ననుభవించు భాగ్యము తెలుఁగువారిది. కవితాకళ వట్టివినోదముగానో, జీవికగానో ఉండఁదగినది కాదని, కవితలమీఁదిబరువు చాలగొప్ప దని, పైపద్యములు మూర్తిగారి పరాయణమును పలుదెఱఁగులుగా చాటుచున్నవి. కవి ప్రజాజీవితమును సంస్కరించి నడపునాయకుఁడు. అతనివాక్కు అతని 'జీవితనిష్ఠను ప్రచురించును'. అతని 'బ్రదుకు పల్కులు రవియున్ రుచియుంబలె నొండొంటికి నుచితాశ్రయ మగుచు నుండు నుడుగని మైత్రిన్'. కనుకనే,

'సంఘమునకుఁ బుష్టి, సంతుష్టి, నొదవించు
వెలఁదిపల్కు వాడ వలయుఁ గృతులఁ;
జిత్తశుద్ధి తపము జిజ్ఞాస నేర్వని
కవి కుదాత్తవాణి కానఁబడదు'

'వెలఁది' అనుమాటకు నిర్మలము అను సామాన్యార్థము కంటె నిర్మలయైన స్త్రీ అనునర్థమే యెక్కువవాడుకలో నున్నది. స్త్రీలపలుకు తన విశిష్ట విభూతులలో నొకటిగా శ్రీకృష్ణ భగవానుఁడు వెలయించినాఁడు,

‘వాక్చనారీణాం’ అని. (గీత. అ. ౧౦) మనకు పుష్టి సంతుష్టులను ప్రసా దించుట స్త్రీ ధర్మము, స్త్రీ స్వభావము. త్యాగశీలమైన ఆ ఉదాత్తత స్త్రీల స్వరమందే మాటలందే సర్వదా ప్రతిఫలించు భగవత్తత్వము. మూర్తి గారి యీ ‘వెలఁదిపల్కు’ కావ్యము ‘కాంతాసమ్మితము’ గా రూపొంద వలె నన్న ప్రాచీన కావ్యలాక్షణికులమాటకు చక్కని టీక. వెలఁది— నిర్మలశీల—కాని స్త్రీ గూడ ‘కాంత’ గాఁ దోఁపవచ్చును — ఎవరికైన, ఎప్పుడో యొకప్పుడు. అటువంటి ‘కాంత’ కావ్యములు నాఁటికి నేఁటికి ఎన్నియో పుట్టినవి, పుట్టుచున్నవి, పుట్టఁగలవు గూడ. కాని వానియందు ఉదాత్తత యుండదు. నైర్మల్యములేని స్త్రీ విషకన్యగా పరిణమించునట్లు ఉదాత్తతలేనికవిత విషవాక్కుగా ఏర్పడును మనపాలికి. కనుక,

‘నియమబద్ధమ్ము మధురమ్ము నిపుణమైన
పలుకుతో సాహితీసృష్టి సలుపవలయు;
రాగరోషాది దుర్వికారములు లేని
కవులకే తోఁచు నిట్టి చక్కని వచస్సు’

ఇది ‘అహింసయైవ భూతానాం
కుర్యాత్ శ్రేయోనుశాసనమ్
వాక్చ శ్లక్ష్ణాచ మధురా
ప్రయోజ్యా — ధర్మమిచ్ఛతా’

అను మనుమహాశయుని స్మృతివాక్యరత్నమునకు ప్రదీపనము.

ఇట్టి లోకకల్యాణహేతువైన కవితకు వలసిన భావనాబలము ‘ప్రజల మేలుగీళ్ళఁ బాల్గొనువారికే’ లభింపఁగలది. కుక్షింభరులకు లభింపదు. కావున,

‘పంటకాఁపు చేతిపనివాఁడు బైరాగి
తక్క నొరుఁడు పల్కఁదగఁడు కైత’

అని కొంత తీవ్రముగా నియమించినారు మూర్తిగారు.

అసాధారణమైన యీ లోకకల్యాణదృష్టియే, ఈ యాదర్శమే మూర్తిగారి సర్వరచనలకును మూలబంధమై బలము నిచ్చి నడిపించినది.

వానిలో శ్రీ గాంధిగారి 'ఆత్మకథ' వీరి తెలుఁగుతీపులో మెదిగి మనము మఱచిపోవుచున్న ఆ మహాత్ముని ఆధ్యాత్మిక ప్రభను అప్పుడప్పుడు కన్నులు మిఱుమిట్లు గొలుపునట్లు చేయు మహాంధ్రకవితారచన.

మహాత్మునితరువాత ఆయనయంతటివాఁడు,• ఆ దివిటీనే ఇంకను ఉజ్జ్వలముగా వెలిఁగించుచు దేశము మూలమూలలను వెలుతురు నించుచున్న వైరాగి, మహామేధావియైన తపస్వి, దేశమందలి రాక్షసశక్తులకు సుదర్శన చక్రమువంటివాఁడు—అగు శ్రీ వినోబా భావేగారి ఉదాత్తాత్మ శ్రీ సీతా రామమూర్తిచేతికి చిక్కి తెలుఁగుమెఱుపులతో ఇంకు మెఱయుచున్నది.

ఆ యిద్దఱు మహామహులందుఁ గలభక్తి, వారి నడవడియందుఁ గల ప్రతిపత్తి, వారి యుపదేశములందుఁ గల ప్రపత్తి—ఇవి నిర్మలములై, అనారోపితములై శ్రీ మూర్తిగారికవిత వెన్నువంగక నిటారుగా నిలఁబడునట్లు చేసినవి.

> 'బరువుఁజూచి కృతికిఁ బరువు నీకుఁడు, చిన్న
> రచన యైననేమి? రాముఁ డందుఁ
> గానిపించునేని మానవు నది తీర్చి
> దిద్దునేని దాని కుద్ది లేదు'

అను మూర్తిగారిప్రార్థనను అనువదించుటకన్న ఈ పీఠిక చేయఁ గలిగినది లేదు.— అస లీపీఠిక దీనికెందుకో శ్రీ మూర్తిగారినే అడుగ వలయును! నాకు తెలిసినది నా యెడ ఆయనకుఁ గల అమిత ప్రేమమే. దానికి నాధన్యవాదములు.

తిరుపతి
15—12—60

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

# మనవి

సర్వోదయము మహాత్ముని పరమలక్ష్యము. ఆయన తనమనుగడలోనే దీనికై గట్టిపునాదులు వైచెను. తదనుయాయు లెందఱో నేఁ డీలక్ష్యసిద్ధికి శ్రమించుచున్నారు. వీరిలో వినోబాభావే ప్రథమగణ్యుఁడు. సర్వోదయమునకు భావే త్రొక్కినమార్గము విశిష్టము. ఇది యావత్ప్రపంచమునకును విస్మయము కల్గించుచున్నది. మహర్షియు మనీషిసత్తముఁడును అగుభావే భూదానయాత్రలో నెడనెడఁ గావించినప్రవచనములు విశ్వకల్యాణ సూత్రములు. ఇవి సర్వోదయసాహిత్యమునకు జీవగఱ్ఱలు. వీని ననుసరించి 'భావేచక్కట్లు' వ్రాసితిని. భావేప్రవచనములు విని పెక్కండ్రు కరఁగిరి. వారికథలే 'పవిత్రసన్నివేశములు'. నేనీ రెండుభాగములందును మూలావిరుద్ధముగా నించుక స్వతంత్రించితిని.

సర్వోదయకార్యకర్తలు శ్రీ వెంపటి సూర్యనారాయణగారు ప్రచురించు 'సామ్యయోగ' పత్రికయు, శ్రీమతి మృదులామూందడా వ్రాసిన 'పవిత్రసన్నివేశములు', శ్రీమతినిర్మలా దేశపాండే వ్రాసిన 'వినోబాసన్నిధిలో' అనుగ్రంథములును ఈరచనలో నా కొనర్చినమేలు మఱవరానిది.

ఆరోగ్య మెంత కొఱవడి యున్నను నా ప్రార్థన పాటించి యీ కృతికిఁ బీఠికను వ్రాసి నాయెడ వాత్సల్యముం బఱపిన విద్వద్విమర్శక వరేణ్యులు పూజ్యులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారికి నా భక్తిపూర్వకనమోవాకములు.

ఈకృషిపట్ల నాకు వలయుగ్రంథములు పంపి యెనలేనిప్రోత్సాహము నొసంగినమిత్రులు సర్వోదయసేవకులు శ్రీ వట్టికూటి వెంకటసుబ్బయ్యగారి సౌజన్యము ప్రశంసనీయము.

ఇట్లు

తుమ్మల సీతారామమూర్తి

# కానుక

దేశమాతృ దాస్యపాశ విచ్ఛేదన
దీక్షమై సబర్మతీమహర్షి
శస్త్రదూరమైన సైన్యమ్ము నడిపిన
తొలిదినాల నాత్మఁ దలఁచుకొందు

కడిమిన్ దాల్మి నొంతయున్ మెఱసి మా
కాణాచి 'కావూరు' ముం
దడుగై నిల్చెను దన్మహారణమునం;
దాయా స్మృతుల్ రేఁగి నా
యొడలెల్లన్ బులకించు నిప్పటికి; నో
హో! యెవ్వఁ డాజోదు మా
పడవాలా? యవు నాతఁడే ! బసవయా!
భక్తిప్రణామం బిదే!

ఒక్క కుదుటిలోనె యొకయూరనే జని
యించినట్టివార మీవు నేను
మనకు 'జాస్తి' వంశమణి సుబ్బయమనీషి
యొకఁడె చిన్ననాఁటియొజ్జ యయె

వివిధధర్మతత్త్వవేది పౌరాణిక
యోగరతుఁడు వీతరాగుఁ డతఁడు
నాకుఁ దెలుఁగు నేర్పె నీ కనాద్యంత మై
విశ్వమూల మైనవెలుఁగుఁ జూపె

గ్రామహితము వలచి గ్రంథాలయంబు నే
ర్పఱిచి యోపినంత బడలుమనకుఁ
గలిగె నిర్వ్యారకును గాంధేయ మహనీయ
ధర్మనిరతి పిన్నతనమునందె

కవితసెప్పి గాంధికథ లల్లి యూరేగి
నాఁడ నేను దెలుఁగువాఁడలందు
నిశితకర్మయోగనిష్ఠ నొక్కెడ నుండి
యెల్లయెడలమెప్పు లీవు గంటి

మాట లెన్నియైన సాటిరా వొకమంచి
చేఁత కనుట నిక్క; మేతదీయ
మర్మ మెఱిఁగి బ్రదుకుమహితాత్మునిన్ నినుఁ
జూచి చూచి యేను సాగయుచుందు

ఆరబ్ధమయ్యె నెయ్యది పుత్తలీబాయి
సుతుఁడు వెల్గించినజ్యోతితోడ
అండయై నడిపె నెయ్యది పరాధీనతా
వ్యూహభంజక సకలోద్యమముల

ఆశ్రయంబొసంగె నెయ్యది దురాధివ్యాధి
మగ్నమై భగ్నమై వ్యగ్రప్రజకు
కదలింపనేర్చె నెయ్యది తన్నుఁ దిలకింప
రాజర్షిమాలియా రాష్ట్రపతిని
యోగమున కార్తసేవానురాగమునకు
సదనమై పొల్చె నెయ్యది యది దిగంత
విశ్రుతవికాసఖని వినయాశ్రమంబు
బసవయా! నీ వదాన్యతాఫలము సూవె !

అంత యింత కాదు సొంత మన్నది యిఁక
నుండదా దటంచు నిండుకలిమి
సకల మాశ్రమంబున కొసంగి నిస్సంగ
సరణి వలచునీకు సాటి యెవరు ?

ఒక్క నీసతి నీ కిట నుద్ది వచ్చు
నేమొ దుర్గాంబ — లోభమ్ము నీసడించి
త్యాగమయ కంటకావృతాధ్వమ్మునందు
నిడుమలకు నోర్చి నీవెంట నడిచె నీమె

గురుఁడు గొల్లపూఁడికులుఁడు సీతారామ
శాస్త్రి మిమ్ము దిద్దఁజాలె నిట్లు
నవభగీరథుని మనస్విని బాపుజీ
ఛాత్రమాళి నితని సంస్మరింతు

చెట్టునందు తాఁతిగుట్టయందును భవ
ద్దేశికుండు సూచె దేవదేవు
నీవు నెల్లజగము నీశ్వరమయముఁగా
నమ్మి బ్రదుకఁ జాలినాఁడ వన్న!

కడగండ్ల మునిఁగి యట్టడుగునఁ బడియున్న
బడుగులతలపుండ్లు కడిగి కడిగి
నా యన్నదిక్కు గానక యేడ్చునిసుఁగులఁ
బ్రేమామృతమ్మునఁ బెంచి పెంచి
మంచానఁ బడి యుమ్మలించెడురోగుల
సెనసి విణ్మూత్రంబు లెత్తి యెత్తి
ముదుకబట్టలమూట మోసి నల్గడ నమ్మి
పేదరాలికి బువ్వ పెట్టి పెట్టి

యీ సమస్తకార్య మీశ్వరసేవగాఁ
జిత్తగించి తనివిసెందు నిన్నుఁ
జూడఁ జూడ మాదృశులమస్తకమ్ములు
తమకుఁ దామ యవనతమ్ము లగును

ఈ సుచరిత్ర మెల్ల నొకయెత్తు తెనుంగులరాష్ట్రసిద్ధికై
చేసిన తావకీనము విశిష్టతపం బొకయెత్తు; నీవు నా
వ్రాసిన రాష్ట్రపుంగృతికి వన్నెలుదిద్దిన యన్న వైతి; వీ
వాసిని నిల్పుఁగాక! మనవంగడ మాంధ్రమహీసపర్యలన్

ఈ విస్ఫుటయశ [illegible] వేనాఁడు నితరు లొసంగు
నీవి యావంతయు నాసవేయము యింత నిష్కృవము
కావచ్చుఁగాక నీ కొక్క కానుక కాంక్షదీఱంగ
నీవలె ననుకొంటి నోయి! కైకొనవె! యీకృతి సుకృతి!

భూదానయజ్ఞదీక్షితుఁడు పరమతపోరాశి వేద
వేదాంగవిదుఁడు భావేమహాఋషి వినిచిననుడులు
పూదండయుంబలెఁ గూర్చి తెచ్చితిఁ బొలుపార దీని
నాదరింపవె! తుమ్మలాన్వవాయసుధాంభోధిచంద్ర!

లోకంబు హింసాకులంబు, సత్యమ్ము లుప్త, మీవేళ
నేకడఁ గన్నఁ జీఁకట్లు తీండ్రించు; నీవిపద్దశను
బోకార్పఁ బెనఁగు నీబోంట్లకుంగాక పూని యెవ్వాని
కైకెత నిడెద ? సర్వోదయధ్యేయ ! యీకొనంగదవె

నీకీర్తి నమరమ్ముగా జగమ్మున నిలుపుటపొంటె
నీకృతి నీకు నీలేద నీత్యాగమే చాలు దాని;
ఓ కర్మయోగిమూర్ధన్య! కర్తవ్య మొకఁడ ప్రేరింప
నీ కిచ్చి ధన్యుఁడ నైతి జయములు ని న్నొందుఁగాత!



# సర్వోదయగానము

## ఆతఁడు

ఆతఁ డుగ్రతపఃకృశీభూతుఁ డాతఁ
డున్నతశరీరయష్టిసంపన్నుఁ డాతఁ
డాత్మసందర్శనోజ్జ్వల దక్షియుగళుఁ
డాతఁ డార్షమహస్సున కానవాలు

అతఁడు నేర్వనివిద్య లే దతని కగ్గ
పడని భాషయు లేదు ప్రాక్పశ్చిమప్ర
పంచసంస్కృతి పుక్కిటఁబట్టె నతఁడు
నిఖిల మానవతా ప్రతినిధి యతఁడు

దుర్భరావేశమునఁ దప్పుత్రోవఁ బట్టు
దేశభక్తిని గాంధేయదిశకు మలఁచి
సత్యసంసక్తమై నహింసాప్రవృత్తి
మై గరిష్ఠతఁ గను కర్మయోగి యతఁడు

జగతి యింద్రియసుఖలాలసతకు లోఁగి
కామ్యకర్మానుగతికమై కదలువేళ
నిత్య నిరవద్య నిగ్రహనిష్ఠ కండ
దండమై నిల్చు నూర్ధ్వరేతస్కుఁ డతఁడు

పరమగుహ్యమ్ము గీతానిబంధితమ్ము
బ్రహ్మవిద్యను బసులకాపరికిసైత
మెఱుకపడునట్లుగా నింత లింత లైన
కథలుగాఁ బ్రవచించిన బుధుఁ డతండు

వ్యక్తి సత్యాగ్రహప్రధనాంగణమున
నిలువఁజాలిన మొదటిసైనికుఁడుగా మ
హాత్మునుల్లము లోఁగొన్న యనఘుఁ డతఁడు
వీనులకు వింతగొల్పిన వీరుఁ డతఁడు

ఒక మహాశాస్త్రమర్యాద నొంది వెలసె
నతఁడు చేపట్టినంతన యలఁతికదురు
ఒక మహావేదబుక్కు వానికిఁ గరఁగి
చల్ల చల్లని దేశిమై వెల్లివిరిసె

కుత్తుకలు గోసి నెత్తురుకూడు గాదు
తృష్ణలను ద్రుంచి యమృత మందించు నతఁడు
విప్లవము కాదు వానిది విశ్వశాంతి
కాదరువుగా నెసంగు సర్వోదయంబు

జనచయమ్ములు దేవతాగణము లయ్యె
దాతలెల్లరు హితాత్ములై తరలివచ్చి
రుభయతారక మగుశాంతి యురలి పొరలె
నతఁడు భూదానయజ్ఞదీక్షితుఁడు కాఁగ

## ఆతఁడు

కలిమి నిచ్చిరి ముక్కారుపొలము నిచ్చి
కొడవలి నిచ్చిరి బ్రమ కిచ్చి రోటలేక
బాపురే! వానిపయనించు బాటలందు
నిండె నీవులు పుణ్యాముల్ పండిపోయె

అతఁడు నిలువెల్ల నర్పించి, యతఁ డజాత
శత్రు వాతనినుడికి మస్తకము వంచి
మిత్తికిఁ దెగించి గజదొంగ లుత్తచేతఁ
బట్టువడుదురు సర్కారు చట్టమునకు

కానరాఁ డిఁక బాపుజీ కనుల కనుచు
శోకమయమూర్తియై క్రుంగు లోకమునకుఁ
బట్టుఁగొమ్మగ నిల్చినయట్టి దీన
బాంధవుఁడు వానుఁ 'వినోబా' యతండు

కోటి కోరఁడేని వానికి దీటువచ్చు
పురుషుఁ డుండినమహికి రాచఱిక మేల
శాసనము లేల యస్త్రశస్త్రమ్ము లేల
ధర్మదేవత నాల్గుపాదముల నడువ

---

# రామగంగ

అది తెలంగాణ మది విప్లవాగ్నిశిఖల
మండి మండ్రాడుచున్న నల్గొండసీమ
యది నిరంతరహింసాభయార్త జన స
మాజదుఃఖాశ్రుజలపూర మగ్నభూమి

అది విపన్నప్రజాహృదయాంధకార
హారణకుశలుఁడు సర్వోదయారుణాంశు
మూర్తి సమతామహాయోగముద్రఁ బూని
తరలి వచ్చిన శాంతియాత్రాపథమ్ము

గ్రామములుకొన్ని కడచి భావేమహర్షి
యల్లనల్లన పోచమపల్లి చేరె
కలిమి గలవారిపన్నీటఁ గా కతండు
లేనివారల కన్నీటితోనె కరఁగె

తీర్చిదిద్దిన మేడమిద్దెలను గాదు
పూరికొంపలఁ దిలకింపఁ బోయెఁ బ్రభువు
పురుటికంపున మునియురంబునకు వచ్చె
నప్పు డొకపాప పూర్వపుణ్యములు పండి

యోగి యెత్తినబిడ్డపుణ్యోదయంబు
పేదసాదులపాలి భాగ్యోదయంబు
పతితమానవదుర్దశాభంజకమ్ము
ప్రగతిశీలప్రజామనోరంజకమ్ము

గాలి వెలుతురు సోరని మార్గమునఁ గదలి
గుడిసెలో మూల్గురోగిని గుస్తరించి
కుండనిండని నూకలకూటి నరసి
గురుఁడు తన్మయుఁడై చూచె గూడెమెల్ల

వరము లిడువేల్పు భూమికి వచ్చె ననుచుఁ
గరములు మొగిడ్చి తమకష్టగాథలెల్ల
నెఱుక చేసిరి సామ్యయోగేశ్వరునకు
హరిజనులు భక్తినమ్రతాభరముతోడ

వెచ్చవెచ్చనియూర్పులు వెడల నపుడు
పల్లియకుఁ జేరుకొనె వినోబాతపస్వి
పిన్నలును బెద్దలును వేచి యున్నకతన
నొకసద స్సాయె నాతనియునికిపట్టు

ఓ మహాజనులార ! యీయోర నున్న
హరిజనులఁ గంటిరే లేమి నణఁగువారి
దున్ని పండించుకొన నింతత్రోవ నిడిన
బ్రతికిపోదురు వీర లాపదలఁ బడక

ముప్పదికుటుంబములవారిముప్పు తొలఁగఁ
జాలునఁట యెనుబదియొకరాలనేల
యెంతమితవాంఛ! మనతమ్ము లీదరిద్రు
లిచట వీరిని దేర్చువా రెవరు లేరె

పరమయోగీంద్రుఁ డీరీతిఁ బల్కునంత
నోలగము నిస్తరంగపయోధి యయ్యె
నవల నొకఱెప్పపాటులో నార్ద్రవాణి
యొకటి యిటు మ్రోసెఁ బరిష త్తహహా! యనంగ

"అస్మదీయ పితృస్మృతి కంకితముగ
నిదె సమర్పింతునయ్యా! నూఱెకరములను"
సాధుతాక్షోణి మనరామచంద్రరెడ్డి
వాణి యిది విశ్వకల్యాణవేణి యయ్యె

'వెదిరి' వంశజుఁ డీదానవీరుఁ డాది
కారణమ్ముగ భూదానగంగ పుట్టె
వెల్లి యిది పొంగి మిట్టలు పల్లములును
జదును పదు నయి శాంతిసస్యము ఫలించు!

# ఖావేచక్కట్లు

## ప్రేమ

అన్నలార! మీకు నార్తి లేకున్నచో
మప్పుఁదగిన దొక్కమాట లేదు
కలదు కలదు మాకు నలజడి యందురా
వినుఁడు వినుఁడు నేను వినుచు పల్కు

తల్లివై తండ్రివై మన కెల్లయెడల
నండవై దండవై దిగుళ్ళంటకుండ
వేయికన్నులతోఁ జూచు వేల్పటన్న
సత్య మెఱుఁగనివారు విశ్వమున లేరు

ఏతండ్రివైనఁ గొడుకుల-
కూఁతుల దెసఁ గీడు కోరుకొనునా మీకున్
గూఁతులు కొడుకులు గలరు గ
దా! తీర్పుఁడు మామకీన మగు నీశంకన్

తమబిడ్డల సుఖమునకై
శ్రమ లన్నిటి నోర్చుచుంద్రు జననీజనకుల్
సముచితమై తనసంతా
నము కళకళలాడఁగాఁ బెనఁగు నీశ్వరుఁడున్

క్షితిపైఁ గల ప్రతి వస్తువుఁ
బ్రతిసంపద నతఁడు కూర్చెఁ బ్రజ లందఱకున్
సుతు లార్తులై తపించుట
కతఁ డోర్వఁ డెన్నఁడును దయామయుఁ డగుటన్

జనకుఁ డెన్ని మేళ్ళు సంధించుఁగాక వా
త్సల్య మెంత కురిసి సాఁకుఁగాక
తెలివిలేని కొడుకు బలిమి గడించునే
పాడిలేనికొడుకు బాగుపడునె

తండ్రి పెంచి పెంచి ద్రాక్షతోఁట నొసంగ
నదను వచ్చి పండె నావనమ్ము
కొడుకు పండ్లు తినక గో స్తనీమద్యమ్ము
దీర్చి త్రాగి త్రాగి తిట్లుపడియె

తండ్రి గోవు నిచ్చెఁ దనయుఁడు దాని పా
లారగించి బలిమి నందలేక
యావుగొంతు గోసి యామిషమును మెక్కి
చెడియె నరకవహ్ని శిఖలఁ బడియె

సుతుఁ డిట్లు పతితుఁ డౌటకుఁ
బిత చేసినదోస మొక్క పిసరున్ గలదా
గతిఁ జూపుఁ గాని జనకుఁడు
ప్రతిదినమున్ గొడుకుముందు పయనించునొకో

ఈదినములఁ గొడు కబ్బయు
వాదిప్రతివాదులైన వార్తలు గలవీ
భేదమ్ములనీశ్వరుఁ డా
పాదించునె ప్రజలు కస్తిఁ బడి దురపిల్లన్

ఈగడ్డం గలపల్లెల
రాగద్వేషములు హెచ్చి రాక్షసధర్మం
బాగుబ్బతిల్లు నేఁ డీ
యాగడ మీశ్వరుఁడు నేర్పెనా జగమునకున్

ఆతఁ డట్లు సేయఁ డధునాతనసమాజ
దృష్టి యింతచెట్ట దెచ్చిపెట్టె
నరుఁడు దారిదప్పినాఁడు వాఁ డొనరించు
పనులు బెడిసి దుష్టఫలము లొదవె

ఏ విత్తు నవని నాటిన
నా వృక్షమె పుట్టుఁగాని యన్యద్రుమ మే
లా వెడలు ? వేఁపగింజకు
మావిడి నొదవించుతోఁటమాలి కలండే

ఈశ్వరుండు జగతి కిచ్చెఁ జల్లనిగాలి
యయిన నేమి చోరభయము హెచ్చి
నరుఁడు తలుపు మూయఁ గరువలికంటె మా
నిసికిఁ దీపి యయ్యెఁ బసిఁడిముక్క

ఈశ్వరుండు జగతి కిచ్చెఁ గమ్మనిజలం
బైన నేమి నరుఁడు దానిఁ జెఱచు
నతఁడు సుకృతరంగ మగుగంగ నైనను
గొంకు మాలి కసటుగుంటఁ జేయు

ఈశ్వరుండు మనకు నిచ్చెను ముక్కారు
పంటనేల నెల్లప్రజలు బ్రదుక
నరుఁడు సర్వభూమి నాకు నా కని గట్లు
వేయుచున్నవాఁడు వెతల కోర్చి

ఈదురాశకతన నితరేతరస్పర్ధ
పెరిఁగి పెరిఁగి నరులు ప్రేమ మఱచి
నిత్యకలహమునకు నిర్భరాసూయకు
దాసు లైరి పాపరాసు లైరి

ఇది సృష్టిధర్మమున కెదు
రిది భగవన్మతవిరుద్ధ మీతృష్ణ దురా
పదలకు మూలము మానవు
నిది దానవుఁ జేయు నాత్మహీనుని జేయున్

తృష్ణ విడిచి మనుజుఁ డితరులఁ బ్రేమించు
టెఱుఁగవలయుఁ దృప్తి మరగవలయుఁ
బ్రేమ మున్నచోటఁ భీతియు దుఃఖంబు
మెలఁగఁబోదు పోరు కలుగఁబోదు

ఈశ్వరుఁడు రెండుచేతుల నిచ్చె నాకు
నితనికిని రెండుచేతుల నిచ్చె వేల్పు
కలసి మే మిద్దఱము చెలికాండ్ర మైన
వెలయుదుము నాల్గుచేతుల విష్ణుభంగి

ఎల్లవార లిట్లె యితరేతరప్రేమ
నేర్చినపుడు కినుక నార్చినపుడు
మల్లడించు విశ్వమానవకల్యాణ
ముర్వికెల్ల నూత్నపర్వ మొదవు

నరు లీచందము నొల్లక
పరస్పరద్వేషములకుఁ బాల్పడి యితరే
తరహస్తఖండనక్రియ
మరగిన నిం కేమి కలదు మసనము తక్కన్

వ్యక్తిగతయాజమాన్యానురక్తి బలిసి
దేశగత యజమానతాతృష్ణ పొంగి
ప్రజలు ప్రభువులు భౌతికబలము పెంచి
కుడుచున్నారు నెత్తురుకూడు నేఁడు

మనరాచఱికం బకటా!
మొనకై తనయర్థ మర్థమును బెట్టు నిఁకన్
దినఁ గట్ట లేనియనదలు
మనుగడ సాగింప నేమిమార్గము చూపున్

ఎటు వోయిన లోకమ్మునఁ
గటకటలున్ గంపనములుఁ గా కే యుండెన్
మటుమాయమయ్యె శాంతి
స్ఫుటజీవన మింతచెట్ట పుట్టం దగునే

ఈ యశాంతిభూత మిట్లు నర్తించుట
సైఁపలేము విలయ మాపలేము
సర్వసమత గఱచి సర్వోదయమ్మును
వలచినపుడె దీని వంపఁగలము

హరిజనులు బ్రాహ్మణులు మిత్రు లైననాఁడు
హస్తిన కరాచి చుట్టము లైనవేళ
నమెరికారషియాస్పర్ధ లణఁగినపుడు
లోకమున శాంతి యొదవు నస్తోక మగుచు

ఇరుగుపొరుగువారి యెడఁ గూర్మిఁ జూపని
మనుజుదెసకు వేల్పుమమత రాదు
పరులతప్పు నోర్చు నెఱి లేనిమానవు
నెగ్గు లెట్లు సైఁచు నీశ్వరుండు

ఆలుబిడ్డలఁ జుట్టాల ననుఁగుఁ జెలుల
నరుఁడు ప్రేమింప నేర్చె నీనాఁటివఱకు
నూరఁ గలవారి నందఱ గౌరవించు
తెలివి నిఁక నభ్యసింపఁగావలయు నతఁడు

ప్రేమకొలఁది సుఖము పెరుఁగును దేహికిఁ
బిండికొలఁది రొట్టె పెరుఁగునట్లు
ప్రేమ నాఁపరాదు పెనువాఁగువలె నది
సాగవలయు దిశల కేగవలయు

నిలిచి యున్ననీరు మలినమై రోగాలఁ
దెచ్చిపెట్టు వెతల రెచ్చఁగొట్టు
నాఁగి యున్నప్రేమ మది కామమై విష
యాళి దెసకుఁ బఱచు నవనిఁ జెఱుచు

ప్రేమగలచోట నీరస పెరుఁగఁబోదు
ప్రేమగలచోటఁ గత్తి కన్పింపఁబోదు
ప్రేమగలచోట నాఁకటిపీడ లేదు
ప్రేమగలచోటఁ బ్రాణి కేభీతి లేదు

ప్రతిహృదయమ్మునఁ బ్రేమా
మృతవాహిని పొంగవలయు నీయుగమునకున్
గతి ప్రేమ సుఁడీ ! లోక
స్థితి కోరినవారు దీని సేవింపవలెన్

ప్రేమార్చకు లగుట యనన్
రామార్చకు లగుట యిహపరమ్ముల శాంతి
శ్రీమంతు లగుట విగత
వ్యామోహులు పాత్రు లీమహత్త్వ గడింపన్

# చట్టములు

కసటుకంపు లేక గరగరనై మేలి
తియ్యమునకు నిండునెయ్యమునకు
విడుపులేని మేటివిడిదియై రాణించు
నెఱఁద గాక ప్రజల నేది దిద్దు?

చట్టములు సృజించి జనతను సవరింపఁ
గడఁగువారు తెలివిసెడినవారు
చట్ట మనిన మందుపట్టు సుమా! దానఁ
బుండు మానుఁ గాని ఱాదు తెగులు

నెత్తుటిలోఁ దెగు లుండఁగ
రిత్తకురిత్తలు గదా! శరీరచికిత్సల్
మెత్తనిపూఁతలకుం గల
పెత్తన మది యెంత రోగబీజము నణఁపన్

పూఁతకతనఁ బుండు పోయినట్లే పోయి
వెండియును జనించు నొండుచోట
వ్రణము నుక్కడంపవలె నన్న లోనికి
మందు నంపవలయు మంచివెజ్జు

చిత్త మపవిత్ర మగుచోఁ
గుత్తుకరుద్రాక్షదండ కూర్చునె ముక్తిన్
బత్తి వలెఁ గాని వేసపు
గత్తర లవి యేల మోక్షకాముకమతికిన్

ప్రేమఝరి పొంగిపొంగి పింపిళ్లుగునిసి
కర్షకులఁ గార్మికుల దిద్దఁగలదు గాని
శాసనము వచ్చి పార్థివసమత దెచ్చి
గ్రామమును దేర్చు ననుమాట గాలిమాట

## పత్రికలకు

బేరమునకు సూనృత సం-
భారము; సత్యవ్రతమ్ము దప్పనియెడ బే
హారియును ముక్తి నందు ను
దారతపోధ్యయనధర్మనిరతుప్పగు భంగిన్

సత్యనిష్ఠ దురాశాప్రసక్తిలేమి
కరుణ మున్నగు సద్గుణోత్కరము వైశ్య
వృత్తికిట జీవగఱ్ఱలై వెలయుకతన
బేర మొకధర్మమై స్మృతిప్రియత నందె

కరుణాప్రేరితులై మన
ధరణిని మాంసాశనమ్ము తగ దన్న మహా
పురుషులలో వైశ్యులు పె
క్కురు కల రీతెఁగన మెచ్చుకొనవలయుఁ గదా!

ఐనను మానవసంఘము
లో నిర్దయ పెరుఁగుచుంట లోకముతో పా
టీనాఁడు వణిజులందును
గానంబడుఁ గరుణలేమి కడునింద్యంబై

అగునుగాక! వీరియాత్మలోఁ గృపయును
గలదు కొంత కొంత కలదు మిగిలి
మనవణిక్కులట్లు కనికరమున్ జూపు
వేరు లొండుచోట లేరు లేరు

కలరు నిర్మాణకుశలత గన్నబచ్చు
లితరభూములఁ; నీకుశలతయు దయయుఁ
గలవణిక్కులు మనభూమిఁ గలరు; ప్రజకు
వీర లెనలేనిమేలు గావింపఁగలరు

కనికరించు టలఁతి గా; దైనఁ గరుణలోఁ
గొదవపడినజాతి బ్రదుకలేదు
రోగి నెవఁడు తేర్చు రోదించుసైనికు
గాయ మెవఁడు కడుగుఁ గరుణ సెడిన

అనుకంప లుప్తమగుచో
మనుజుని జీవనమునందు మాధుర్యము లేఁ;
దనవధికదయాఖనిఁగా
మనపెద్దలు మెచ్చి రీశుమంగళమూర్తిన్

నరుఁడు కోల్పోఁదగిన పరమోత్తమగుణమ్ము
కరుణ యనఁగఁ జెల్లుఁ గాని నేఁడు
కరుణ దాసి యయ్యెఁ గటకటా ! జగతికి
రాణి యగుచు శక్తి రాణకెక్క

ఏ ప్రభుత్వమైన నీనాఁడు నిజదేశ
పటుత వలచి దృష్టి పఱుపుపట్ల
దయను బెంపుసేయఁ దలఁపదు సైనిక
బలము నుద్ధరింపఁ దలఁచుఁ గాని

తనరాజ్యమ్మునఁ గరుణకు
ననవద్యస్థాన మున్నయపు డుర్వికి నె
ల్లను శాంతి లభించుఁ గదా!
కనికరము జగజ్జయాదికారణము కదా!

రాచతికములం దొకటియు
నీచక్కనిబాట కేగ దీక్ష్యాదు లెదన్
గ్రాఁచుట నస్త్రపిశాచీ
నీచపదారాధనమ్ము నెఱపన్ దివురున్

నరుఁడు కరుణ కెంత కరఁగునో తెలియని
గుట్టు కాదు; నేఁడు కోట్లకొలఁది
ప్రజలు క్రీస్తు నేల భావింత్రు గౌతమ
బుదు నేల తలఁచి పొగడుచుంద్రు

కారుణ్యమూర్తి బుద్ధుఁడు
మారాజ్యమునందె పుట్టి మనుజుల కెల్లన్
దారకము నేర్పె నని మన
వారలు గర్వింత్రు వాడవాడలయందున్

సత్య మిట్టిది యైనను శక్తి కగ్ర
పీఠ మిడి నేఁడు మ్రొక్కులు పెట్టుచుంద్రు
కరుణ వైయక్తికోన్నతికారణ మఁట !
శక్తి సామాజికోన్నతిసాధన మఁట !

ఎంతపడిన విశ్వశాంతి రాదయ్యో నీ
శక్తికతన స్వార్థభక్తికతన
బుద్ధిమంతులెల్లఁ బూని పట్టాభిషే
కము నొనర్పవలయుఁ గరుణ కిపుడు

దయకు లొంగిలొంగి దాసానుదాసులై
మాంసభక్షణంబు మానుకొన్న
వలఁతు లిచటి వర్తకులు గాక యిం కెవ్వ
రర్హు లిట్టిశాంతియజ్ఞమునకు ?

నిక్క మిట్టు లుండ నేఁటివర్తకు లాత్మ
రక్షకొఱకు శస్త్రశిక్ష గన్న
భటుని బెంచుకొంద్రు పవలింటినిద్రతో
నెలమి లేనిబ్రదుకు నీడ్చుచుంద్రు

దయగలవారికి నీ య
త్యయ మేల జనించె వీరిదయ లవమాత్రం
బయి పుట్టిన దీ దుస్థితి
దయాళువులపట్ల నిట్టిదండడి యగునే

అక్కటికమున్నవానికి
నక్కఱలే దెట్టివెఱయు నాతనిబ్రదుకున్
రొక్కము నెవరున్ జెఱుపరు
మక్కువపడి జగము వానిమంచికె పెనఁగున్

చీఁకటి వెన్నెల బాటల
రాకల నార్జించి నూఁఱురూప్యమ్ములలో
నేకాంశ మర్థి కిచ్చిన
లోకం బిది చూచి తృప్తిలో మున్గునొకో!

వెచ్చమునకు నంగడిదెస
వచ్చినపసిపాప నైన వంచించుటకున్
జొచ్చెదు బచ్చులు గలమహి
కుచ్చెర్దశ యెట్లువచ్చు నూహింపుఁడయా!

కూలివాఁడు మూఁడుజాలు కష్టించి రూ
పాయి పడయు లేమి పదులు నూర్లు
నేల పడయు లేమి నేసారి? యీబేర
మెట్లుతగును ధర్మ మేడియిచట

పొందవచ్చు బేరి పొట్టకు బట్టకు
వలసినంతలాభ మలసి యలసి
మితిదాఁటంగి వణిజుఁ డతిసంచయమునకు
బ్రుగ్గరాదు నింద కొగ్గరాదు

లేదులేదు బేరి కాదర మీనాఁడు
వణిజుఁ డిట్టులగుట వంతగూర్చు
నాతఁ డొక్కతటి 'మహాజన' పదవాచ్యుఁ
డూరికెల్లఁ బ్రాణ మొక్కనాఁడు

ఇట్టివాని కేల పట్టిన దీక్షి
దొడ్డవాని కేల దూఱువాడమె
గీత మెచ్చినట్టినీతి కీ యవమతి
యేల వచ్చె భీతి యేల హెచ్చె

భారతీయవణిజులార ! మీరిందు స
మీక్షసేయవలయు నిట్టి పనికిఁ
దగినబుద్ధి మీకు భగవానుఁ డొసఁగె లో
కానుభూతి మీకు నగ్గలంబు

తనియకుఁడు మీర లల్పాల్పదానములను
గొనియకుఁడు లక్ష లార్జించుకొంటి మనుచు
సిద్ధపడుఁడు కృపామయజీవనమున
కాసచేయుఁడు భయదూర మైనసరణి

పడవలోని కురలిపడు నీటి నిరుగేల
వెలికిఁ ద్రోయులీల నెలవునందుఁ
గుదురుకొనెడి సొమ్ముకూడ దోసిళ్ళతో
నొరులకిచ్చి యింటి నోమవలయు

ఆటబంతి నందినంతనే తన్నిన
పగిదిఁ దన్నవలయుఁ బసిఁడి నైన
నపుడు సంఘదేహమం దది సొచ్చు స
మాజమునకు నపుడు తేజు వచ్చు

ధర్మనిష్ఠ మీ కుదాత్తమై కలదు మీ
మంచితనము నెల్లఁ బంచిపెట్టి
లోకశాంతి గూర్పఁ డీకొనుఁడీ ప్రజా
సేవనమున కన్యచింత విడిచి

రండు ప్రజామధ్యస్థలి
కిందు ప్రజాసేవ కాత్మ నిం దాహుతియై
పొం డివ్విధి బలిపోయిన
దండి మగం డొకఁడు భారతక్షితిఁ బుట్టెన్

అతఁడు మీవాఁడె వానిమహత్త్వమెంచి
శిరము వంపనివార లీధరణి లేరు
పుట్టినది మొద లాప్రాణి గిట్టుదనుక
మదిని దన వైశ్యధర్మంబు మఱవలేదు

అతఁడు గోసేవ గావించె ముతుకబట్టి
నాదరించెను దో లూని యారె పట్టె
మలము నెత్తెను మాలకు మాల వైచె
నార్తులకు నండదండగా నారటించె

అతఁడు కరుణామయుండుగా నవధరించి
నట్టిచేఁతలు వేనవే; లతని మించు
వాఁడు మానవకోటిలో లేఁడు నేఁడు
పిలుచుచున్నాఁడ నాతనిపేర మిమ్ము

అతఁడు గాంధిమహాత్ముఁ డాయన్నవోలె
మీరు కరుణావిధేయులై మెలఁగవలయు
సంఘసేవకు మీదయాచతురతలను
ధారవోయంగవలయు నుదారబుద్ధి

వైయక్తిక సామాజిక
ధీ యుపు డేర్పడదు గుండెదిగు లన్నది లే
కీ యవనీరాజ్యము సు
శ్రేయోరాజ్యమ్ముగాఁ బ్రసిద్ధి వహించున్

వినుఁ డెన్నఁటికే నిచటన
యనుకంపారాజ్యతంత్ర మారబ్ధ మగున్
ఘనతరసామ్రాజ్యమ్ములఁ
దృణముంబలెఁ దన్నిపోయి రిచ్చటివారల్

ఈనేల సామ్యవాదము
నౌ నని దొరతనమువార లాదృతిసేయన్
రానేరదు కరుణామయు
లైనవణిక్కులకు భీతి యప్పు డించుకయున్

సంఘసేవకై బేరముల్ జరుపువారు
భోగములచెంత కేనాఁడుఁ బోనివారు
రవ్వరవ్వకు లెక్కలు వ్రాయువారు
భయముపడనేల ప్రజలకై బడలువారు

ఓసాహుకులార! నే నిపు
డాసేతుహిమాచలమ్ము నలయక చనుచున్
భూసంపద నర్థించెద
నా సంప్రార్థనము దినదినమ్ము ఫలింపన్

ఇచ్చిరి భూస్వాములు పొల
మిచ్చెద నీపొలము పేద కిది సవరింపన్
వెచ్చింపుఁడు మీవిత్తము
పచ్చనిపై రపుడు విరిసి పంటలు పండున్

ఒడ్డెవాండ్రఁ బిల్వఁ డోయన్నలార! నాఁ
గేలు బండి గిత్త గేదె గాదె
పాఱ పలుగు మోకు పగ్గాలు విత్తనాల్
కొనుఁడు పేద నాదుకొనుఁ డొసంగి

నాపని భూమి గడించుట
మీపని సవరింతసేఁత మీ రిందులకై
యేపూఁట వత్తురా యని
చూపెల్లన్ బఱపి మిమ్ముఁ జూచుచునుందున్

నాతో స్పర్థకు రం డిఁక
మీతలఁ పీ ధర్మనిష్ఠ మే లన్నతఱిన్
భూతల మెల్లను గరుణా
కేతనములనీడఁ జెమ్మగిలి చిగురించున్

## మనుష్య జన్మము

ప్రాణి పలుపుట్టువుల డస్సి పడసినట్టి
సుకృత ముండినఁ గాక యూరక మనుష్య
జన్మము గడింప దని ధర్మశాస్త్ర మనుట
నిక్క మగుమాట చొక్కమౌ నిర్ణయంబు

మానవేతరజంతుసమాజ మెల్ల
ప్రొద్దు లారాటపడఁ దనపొట్టకొఱకు
స్వార్థమే తక్క నన్యప్రసక్తి లేని
మూఁక యిది; దీన నుర్వి కేమోతు మొఱగు

మనుజుండును దనకిండిగి
ననుదిన మల్లాడుచుఁ గాని [illegible]
దనపొట్ట గట్టుకొని [illegible]
న్యుని యాఁకటిమంట లార్చి యుల్లాసమునన్

పసరమ్మున కీభోగము
వసపడునా? [illegible] ప్రాప్తై
యును జెడి నరుండు గను సం
తసమునకున్ జాలుసుఖము ధరణిన్ గలదా

పశుత పాపకర్మఫలమును గుడుపంగ
సురత పుణ్యకర్మసుఖము నందఁ
బొసఁగినట్టి పుట్టువులు; పురుషార్థసం
పాదనమున కిందుఁ బట్టు లేదు

ఒక్కనరతయే! కర్మయోగమునను
నర్హ; మిది పాపపుణ్యఫలానుభూతి
కబ్బినభవమ్ముగా; దా [illegible] సాగుచువాని
సేవ గావింపఁగా లభించినది గాని

కానన్ గడుమూర్ఖ [illegible]
మానవజన్మంబు; దీని మన [illegible]
జ్ఞానమ్మునఁ బశువులందు
దానన్ జరియించు; [illegible]

పరులగోడు సుంత పట్టించుకొననిచో
శాంతి లేదు మనకు నింత యైన;
వినుఁడు! తమ్ములార! విశ్వహితార్థులై
మనుఁడు మంచిబాటఁ గనుఁడు చనుఁడు

ఇదియె సర్వోదయంబు నా నెసఁగు; దీని
నాదరింపుఁడు! లోకసేవానురక్తి
నభ్యసింపుఁడు! సార్థక మగు నరత్వ
మలవఱుచుకొండు! లెండు! మీ కపుడె ముక్తి

కవులు

ప్రజలమేలుగోర్కెఁ బాల్గొనువారికే
భావనాబలమ్ము బలసియుంటఁ
బంటకాఁపు చేతిపనివాఁడు బైరాగి
తక్క నొరుఁడు పల్కఁదగఁడు కైత

రచయితజీవితనిష్ఠను
బ్రచురించును వాక్కు; బ్రదుకుపల్కులు రవియున్
రుచియుంబలె నొండొంటికి
నుచితాశ్రయ మగుచునుండు నుడుగనిమైత్రిన్

సంఘమునకుఁ బుష్టి సంతుష్టి నొదవించు
వెలఁదిపల్కు వాడవలయుఁ గృతులఁ
జిత్తశుద్ధి తపము జిజ్ఞాస నేర్వని
కవి కుదాత్తవాణి కానఁబడదు

ఉదయార్కరుచులు విరిసె
మృదుగానమ్ములను జనుల [illegible]
సదమలసాహితియుం బ్రజ
నిమురన్ వొలగించి ధర్మనిష్ఠను గాంచున్

ఆము విడనాడి వేమ[illegible]
నాశ్రయ మొసంగు [illegible];
నతని మురళిని జేసి బ్రహ్మానంద[illegible]
దనియుచుండాన మధురగీతములు పాడు

నియమబద్ధము మధుర[illegible]
పలుకులతో సాహితీసృష్టి సలుపవలయు
రాగరోషాదినిర్వికారములు లేని
కవులకే తోచు [illegible]

తక్కినవెం పెటు లున్నను
నిక్కముపైఁ గవికి దృష్టి నిష్ఠయు నిలుచున్
టక్కరి కవితా రచనను
మక్కువపడఁ గాక లోకసామాన్యం బగునా

మది వేలు మాటలేల
బ్రదు కీడ్చుపిపాసి[illegible] దగున్
బదిమందిని గదలించెడి
చదు రానుడి కబ్బదె సంకటపడినన్

త్రికరణశౌచశ్రీ తే
ని కవులు పత్రంబు లెన్ని నింపిన నేమా
నకలంకము కవితారస
మొకబిందువుపాటి నైన నూరద యందున్

వెజ్జుకడ రోగి తనతప్పు లుజ్జగింప
కెల్లయును దెల్పురీతి సాహిత్యకర్త
యీశ్వరప్రతిబింబ మా నీప్రజాళి
యెదుటఁ బ్రకటింపవలె సత్య మెట్టిదైన

అది కావ్యం బది సాహితి
యెది కవియాత్మానుభూతి నెనసినసర్గం
బది ప్రాణికిన్ బవిత్రతఁ
గదియించుఁ గరంచు నది జగంబులనెల్లన్

సామాన్యజనులలో నొకఁ
డై మను సాహులకు లొంగఁ డార్తిని సైఁచున్
ప్రేమించు గంజి నైనను
రామునకే మ్రొక్కు సుకవిరా జెల్లపుడున్

గిఱిగీచుకొన్నకవికృతి
చిరకాలము నిల్వ; దెల్లసిద్ధాంతములన్
దరియించి విప్లవము దెస
కరిగినకృతి సత్యదర్శియై రాణించున్

బరువుఁ జూచి కృతికిఁ బరువు నీకుఁడు; చిన్న
రచన యైన నేమి? రాముఁ డందఁ
గానిపించునేని మానవు నది తీర్చి
దిద్దునేని దాని కుద్ది లేదు

ఈవికతన నేఁడు జీవితానంద మే
ర్పడును గాన నెవని బ్రదుకునందు
నివ్వటిల్లుచుండు నిర్భరత్యాగ మా
తనికవిత్వమునకుఁ దనియు జగము

ఒకనివాంఛకు నొకనియాజ్ఞకును లొంగి
కలము సారింప నొల్లఁడు కవివరుండు
నిదురయును మెచ్చఁ డాతఁడు హృదయవీణ
కదలినపుడెల్ల నమరమా కవితఁ బల్కు

సిరుల కమ్ముడువోక యీశ్వరుని నమ్మి
నిలిచిన కవీంద్రులే మాననీయదీప్తి
నిడి రయా భారతీయసాహిత్యమునకుఁ
బోతరాజాదు లీకోవఁ బుట్టినారు

అన్నలార! మహీదానయజ్ఞవిజయ
మాసచేయుద మిది కృత్య మని కవీంద్రుఁ
డొకఁడు భాషించెనా తన్మహాశక్తి జనుల
మెప్పు గనితీరు నవయుగ మప్పు డొదవు

# కదంబము

సైఁపఁజాల నేఁటిసంఘవ్యవస్థ; నీ
యవని రామరాజ్య మమరవలయు
నపుడు రాజు రాముఁ డఖిలప్రజాళియు
రాముఁ డుర్వియెల్ల రామమయమె

దొంగతనమువంటిదోసమపో! సిరిన్
గూడఁబెట్టి దాఁచుకొనుటసైత
మిది యకృత్య మనుచు నిపుడు గాకున్న రే
పైన లోక మొప్పు నని తలంతు

అడుగు మని నన్నుఁ బ్రేరేచినట్టివేల్పె
యి మ్మనుచు నన్నుఁ బురికొల్పె కేలమాను
బిడ్డ కాఁకలి పెట్టినదొడ్డదేవుఁ
డమ్మఱొమ్మున నూరింపఁ డా పయస్సు

దీనజనులు దేవదేవుపాదము లౌట
నార్తసేవఁ బండినట్టిసుజను
లందఁగలరు భగవదంఘ్రిద్వయమ్మును
బట్టి మోఁకటిల్లి పడయుఫలము

ఈపేదలు మనవేల్పులు
పాపము! వీ రెండి తడిసి పస్తుండి జగం
బాపోవఁ గూడుపెట్టెద
రోపికలో వీరి కుద్ది యుండ రెవరున్

పిల్లలు రక్షించెద రని
తల్లి నిరీక్షించు నవ్విధమ్మున మీపై
నుల్లము నిడుకొని కాలము
చెల్లింతురు వీరు జాగుసేయకుఁడు దొరల్!

తడసిన మీదోసము వే
మఁడుఁగు లగున్ విలయవహ్ని మార్కొను మిమ్మున్
నడిచి నడిచి వచ్చితి మీ
యెడఁదన్ నిదురించునీశు హెచ్చరికింపన్

బాపు లేమి నిపుడు బయటికి వచ్చితి
నేతఁ గాను మీకు నేను భటుఁడ
మ్రొక్కుచుంటి భక్తిముగ్ధుఁడనై గుణ
భద్రులార! మత్సపర్య గొనుఁడు

ప్రేమ పెరుఁగుఁ దెలివి పెరుఁగు నాయుష్యమ్ము
పెరుఁగుఁ బాదయాత్ర జరుపు వేళ
నడువ కుండువాఁడు నలువదియేండ్లకే
తాత యౌను లేక ప్రేత యౌను

పదయాత్ర శంకరాదుల
మది మెచ్చినయాత్ర జనులమనముల కింపున్
గదియించుయాత్ర దీనిని
వదలన్ భావప్రచార వరసాధనమున్

నిదురఁ గలి నుండు సెజ్జను వదలి కూరు
చున్నచో ద్వాపరమ్మున నుండు నరుఁడు
నిలిచెనా త్రేత నుండు నజ్జలు కదల్చి
త్రోవఁ జనువేళ నతఁ డుండుఁ దొలియుగాన

ఏనాఁ డపరిగ్రహమును
మానెన్ బాపఁడు తదీయమహిమము సర్వం
బానాఁడె సమసెఁ బ్రాజ్ఞుఁడు
కాని కెగఁబడినవాఁడు కలఁచున్ బ్రజలన్

సుదతులు శూద్రులు వేదము
చదువం జన దనెడిపల్కు సైఁపను; నాకున్
జదు రున్నది శ్రుతివిద్యన్
మది యున్నది దీని నేర్పి మనుజులఁ దీర్పన్

అతివయందుఁ బురుషునందు నాత్మ యొకండె
నిలుచు నన్నమాట నిక్క మాట
బ్రహ్మచర్యదీక్ష పాటింపవచ్చును
సంన్యసింపఁదగును జాన యైన

దేవుఁడు కలఁ డని నమ్మక
పోవచ్చు నొకండు వాఁడు భూతహితమ్మున్
భావించిన సత్యముతో
జీవించినఁ జాలుఁ బెద్దచేసెద నతనిన్

నరున కున్నసేవ పరిమిత మౌటచే
నతనిసేవసైత మవధి నుండు
సేవ కెల్ల యుంట చెల్లును గాని భా
వనకు మేర యుంట పనికిరాదు

ప్రజ కెల్ల సేవచేయుట
నిజమునకు నసాధ్యః మైన నిఖిల ప్రజయున్
స్వజనంబ యని తలచుచుఁ
ద్యజింపవలె నరుఁడు కులమతాదివివక్షన్

దేహమను గాను నేను సందీప్త మైన
యాత్మ నని నమ్మవలయు దేహమ్ముపట్ల
నాదరము పుట్టినా వైర మవతరించు
ముక్కలై చెక్కలై యాత్మ ముప్పుదెచ్చు

మనకుఁ జేటుగూర్తురు ముసల్మాను లనుచు
హిందువులు జంకెదరు గాని హిందువులకు
దోసఁగు దెచ్చెడివారు హిందువులు గాక
యన్యులుండరు నమ్ముఁడా యస్మదుక్తి

కులమతభేదమ్ములపై
వల వుంచిన, నంటరానివాఁ డని యొకనిఁ
వెలిపెట్టిన మనమే మన
విలయము సృష్టింతు మొరులవెంపర యేలా ?

వెలుపటిదెస మనశత్రులు
కలరా? మనయెడఁదయుండె కల రుద్ధతులై
యిల మనకున్ నెచ్చెలి కా
వలయు ననన్ జెలిమిఁ జూపవలె మన మిలకున్

ప్రేమశుకము కలదు మీమదిలో, దీనిఁ
బఱుపకుఁడు కుటుంబపంజరమున;
నిచ్చవచ్చినట్లు లేదె ఱెక్కలాడింప
నిచట నచట నెగుర నియ్యకొనుఁడు

ఏ నింతదనుక నొకఖలు
నేని విలోకించియెఱుఁగ నిది విని లోక
జ్ఞానం బబ్బని మూర్ఖుని
గా నను మీ రెంతురేని గా దన నొల్లన్

నామ్రోల నెవఁడు నిల్చిన
నామానవునందు వేల్పె యగపడు నాకున్
సామాన్యధర్మ మైచన
నామనుజన కంజలించు నస్మత్కారముల్

మనకహింస నియతమార్గ మీబాటను
విడువ కుందుమేని పుడమినెల్ల
నెత్తఁగలము మన మహింసాపతాక లీ
నుడువు లెడఁదఁ జీల్చి విడుచుచుంటి

ఏ నలంతివాఁడ నైన నీశుఁడు బుద్ధ
దేవుపనికి నన్నుఁ దెచ్చి నిలిపె
శాక్యమునిపవిత్రచరణాంకముల నాశ్ర
యించి విధిని నిర్వహించువాఁడ

జలకణమ్ము వార్ధిఁ గలసి పయోధియై
యలరుచందమున నహంత విడిచి
నరుఁడు తన్నుఁ దాను మఱచి విశ్వాకారుఁ
డైన వేల్పునందు నణఁగి వెలయు

చట్టములు కావు ఋషులే
పుట్టింతురు విప్లవమ్ము బుదుఁడు ప్రభుతా
పట్టమును రోసి కావిం
గట్టి కదా క్రాంతి దెచ్చెఁ గనుఁడీ చరితన్

మనకు సత్యనిరతి మప్పె రాఘవుఁడు ని
ష్కామ కర్మనిష్ఠ గఱపెఁ గృష్ణుఁ
డార్త లోక సేవ నలవరించెను బుద్ధుఁ
డీ త్రయమ్మె మనల సృష్టిచేసె

---

# పవిత్ర సన్నివేశములు

## నా వంతు కూడ

చివురించిన డెందముతో
నవయుగనిర్మాణదీక్ష నల్గొండమహిన్
బవ లని రే యని చూడక
భువికై భావేమహర్షి పోవం దొడఁగెన్

నడిచి నడిచి సూర్యాపేటనాఁ జెలంగు
వీటికిం జేరె నతఁడు; తద్విజయ మెంచి
వచ్చి రానాఁడు పల్వు రావసుధ నున్న
కార్యకర్తలు యోగిపుంగవునికడకు

వారి నాదరించి వలసినసందేశ
మిచ్చుగురుఁడు తుదకు నిట్లు నుడివెఁ
"దగఁడు కార్యకర్త తనపా లొసంగక
యుర్వి నిం డటంచు నొరుల నడుగ"

అనినవెనుక వింజ మూఁ కిడినట్లుగా
నుండె గోష్ఠి; సభ్యు లొకని మొగము
నొకఁడు చూడఁ దొడఁగి; రెకరాలు పెక్కున్న
వారు గలరు సభను వందమంది

ముందటి కోకఁ డైనను రాఁ;
డందఱు సందిగ్ధదశకు నగ్గంపడి; రీ
చందము నోర్వం జాలక
మందస్మితమూర్తి యొక్కమానిసి లేచెన్

అతఁ డిట్లు పల్కె "మాయన్నకు నాకు
నిల నాల్గువందలయెకరమ్ము లుండె
నవిభక్త మస్మదీయకుటుంబ; మైన
నాపాలినేలలో నా కొకసగము
తక్కనసగము భూదానయజ్ఞమున"
కనుడు నోలగమెల్ల నప్లాన మయ్యెఁ
గరతాళరవము లాకసమున కంటెఁ
గార్యకర్తలలోనఁ గదలిక వొడమె
నెవరిభాగము వార లిచ్చిరి పొలము
భావేతపం బిట్లు పంటకు వచ్చె
నౌదార్యలక్ష్మి యి ట్లవతీర్ణ యయ్యె
మొదటితాంబూలంబు ముట్టెఁ గోదండ
రామరెడ్డికి ధర్మరతునకీనాఁడు;
తమ్ముఁ డిమ్మెయి దానతత్పరుఁ డైన
నన్న మిన్నక యుంట యది యెట్లు పొసఁగు
నిరుగూరి కేగినయితఁ డెట్టిసంజ
తటి కిల్లు సేరి సోదరుఁ డోజ దప్పి
సలిపినపనికి విస్మయమంది కుంది

తేఱి భావేసన్నిధికిఁ జేరి మ్రొక్కి
తొనఁకని పల్కులతో నిట్టు లనియె

"అయ్యా! నేఁటిదనుక నఱ లేక యుమ్మడి
బ్రదుకు బ్రదుకుచున్న కుదురు మాది
తమ్ముఁ డొకఁడు కలఁడు తనకు వాఁ డీనాఁడు
నన్ను వేఱుచేసినాఁ డదేమొ

మా కున్న భూమిలో సగ
మీక సగమ్మున సగంబ యిచ్చె నతం డీ
పోకడ కె ట్లోకొనెనో
నా కిది తుదిలేని వేదనను గూర్చుఁ బ్రభూ!"

కన్ను లశ్రువారికలుషితములు గొంతు
గద్గదస్వరాతికంపితమ్ము
మొగము విన్నఁదనపుమయ్యెలగుట్టగా
రడ్డి యిట్లు పల్కి రచ్చ తనియ

దానపత్రము పూరించి తమ్ముఁ డొసఁగి
నంతపుడమి నొసంగె విశ్వానుభూతి
కౌను వెఱఁగేమి యొకకొమ్మ కవతరించు
పండ్లలో రుచిభేద మేర్పడుట కలదె

పురుషోత్తమరెడ్డి యనన్
ధర నితఁ డన్వర్థసంజ్ఞఁ దనరు నయారే !
చిఱుత కిటు తగినపే రిడు
నెఱి నేర్చిన పితరు లర్చనీయులు గారే

భూదానముతో గోదానము

ప్రత్యూషం బది; జనతా
నుత్యంచితుఁ డైన మనవినోబా యపు డా
దిత్యపురిక్ దాఁటిగి నిజా
మాత్యులతోఁ బయనమయ్యె మఱియొక దెసకున్

అంత నొకయింతి వడివడి నరుగుదెంచి
సంయమికి భక్తియుక్తి నంజలిఘటించి
"బాబయా! నిన్న వింటి నీపల్కు నిచట
నది మహేశ్వరవాణిగా నరసికొంటి

నీపలుకున్ దలఁ దాల్చుట
పాపంబుల నణఁచుకొంట పరమేశ కృపా
శ్రీ పొందుట మోహాదుల
తాఁ పందక సుఖపరంపరను గంట ప్రభూ!

లోకశాంతికొఱకు నేకైకమార్గమ్ము
సూచినట్టి దివ్యరోచి వీవు
ఋషులసుకృత మెల్ల నీవుగా భారత
భూమి నిపుడు వెలసెరా మహాత్మ!

ఏను బిడ్డలున్నదాన రెండెకరాల
పొలమె కలదు నాకు నలఘుచరిత!
యొక్కయెకర మిచ్చి మ్రొక్కి పో వచ్చితి
నల్పదాన మనక యందుకొనవె!

ఈదానమునకు బాసట
గోదానము నాచరింపఁ గోరికవడితిన్
లేదూడతల్లి యీగవి
సాదులలో సాధనెన్ బ్రసాద మెసంగన్

యోగి కనుల నశ్రు లురలంగఁ బొరలంగ
నెలుఁగు రాల్పడంగ నిట్టు లనియె
"యింతపేదరాలియీవి పెద్దలఁ గరఁ
గించి తీరు జయము నించి తీరు"

పగ తెగుట

తంగెళ్లపల్లి యను నూ
రం గలసోదరుల కిద్దఱకుఁ బో రొదవెన్
క్రింగె నిది పల్లెనెల్లను
బ్రుంగిరి ప్రజ లిందు రెండుపోకలవారై

ఒకవర్గమువారి మొగం
బొకవర్గమువారు చూడ నొల్లరు తలఁపుల్
తెక తెక మనఁగా నెయ్యము
లుకలుక మని నరత లోఁతులోఁతుల నొదిఁగెన్

తమ్ముఁ డింటిని గాదు గ్రామమ్ము వీడి
బ్రదుకుచున్నాఁడు పెఱవారిపంచలందు
నతఁడు తనయింట భావేమహర్షి విడిసి
యుంట విని నిలుపోపక యూరుసేరె

మీబెడఁద లెట్టివో యని
బాబా ప్రజ నడిగె “నేమిపల్కెదము ప్రభూ!
మాబ్రదుకు లీరసం బను
నూబిం బడి క్రుళ్లుచుండె నుస్సురు మనుచున్

ఈసోదరుల విరోధమె
మాసంసారముల కెక్కె మమ్మీగతి నా
యాసంపెట్టెడి నీపగ
మాసినచో మావిపత్తు మటుమాయ మగున్”

జానపదు లిట్లు సెప్పిరి; మ్లాన వినత
వదను లైరి సహోదరుల్; వారిఁ జూచి
యోగిచంద్రుఁడు “వింటిరే! యూరివారి
పలుకు? మీ రింతపెడదారిఁ బడితి రేమి

పగ పగతోఁ జావ దయా!
పగ నణఁచెడిమందు మిత్రభావంబ చుఁడీ!
పగ పెరిఁగినఁ దెగ విఱుగున్
బగ యెంతటిచెట్ట కైనఁ బ్రాపై నిలుచున్

బాపురే! యొకనెత్తురు పంచుకొన్న
వారుగద మీరు మీ కింత వైమనస్య
మున్న నెందఱుతల్లులో కన్న కోట్ల
కొలఁదిబిడ్డలు మనెదరా కలసి మెలసి

మైత్రి లేనినాఁడు మహి నిల్చునా జగత్
ప్రళయహేతువైన పగను వదలుఁ
డన్నలార! సుప్రసన్నులు కండు మీ
చెలిమికై నిరీక్ష సేయు నూరు"

అనుడు నన్నదమ్ము లార్ద్రమనస్కులై
తేఱుకొనిరి మేలు తెలిసికొనిరి
యొకనిప్రక్క నొకఁడు సుకముగాఁ గూర్చుండి
ప్రన్నప్రన్నఁ దినిరి బంతిబువ్వ

వేల్పుపాట సాగువేళ నిద్దఱు బిగ్గఁ
గాఁగిలించుకొనిరి కనులు తడియ
నేమి సెప్పువాఁడ భీమజరాసంధు
లెలసి రామలక్ష్మణులుగ నైరి

ఇద్దఱు భావేగురునకుఁ
బెద్దయు భూదాన మిడిరి పెంపిదిగని యూ
రద్దిర! తపోబలమ్మున
కుద్ది గలదె యని నిరంతరోత్సవ మయ్యెన్

## ఆ అ వ కొ డు కు

భూదాన హోమా ధూమ
ప్రాదుర్భూతములు సురభిపవనమ్ములు స
ర్వోదయమూలము లల్లన
రాఁదొడఁగెన్ దెలుఁగునుర్వరకు నల్గడకున్

చిన్నపల్లెఁ జేరె శ్రీ వినోబా నల్ల
గొండ నాఁ జెలంగుమండలమున
నతఁడు తెల్గునంద యాయూరివారితో
ముచ్చటింప సాగె ముద్దులొలుక

ఒక హాలికుఁ గన్గొని నీ
కెకరా లేపాటి యుండె నెఱిఁగింపు మనెన్
బ్రకటించెఁ దొమ్మి దని సే
ద్యకాఁడు; భూదాన మిడితివా? యనె భావే

నవ్వినవ్వి కాఁపు నా కాస్తి యలఁతిగా
నుండెఁ గొడుకు లేవు రుదితులైరి
లెక్కచూడ వీరి కొక్కొక్కనికి నెక
రాలు రెండుకూడ రావు రావు

ఇట్టిపేదవాఁడ నే నేడ భూదాన
మేడ; మేడ లున్న యీడువలును
బాడువలును బల్లెపల్లెలో నున్న యా
దొరలుగాక యీవి కొరులు తగరు

అని పల్క భావేమహర్షి యిట్లనియె
"నోతమ్ముఁడా! విను మొకమాట భగవ
దనుకంపమై నీకు నాఅవకొడుకు
జనియించు ననుకొమ్ము జనియించినప్పు
డేమిచేసెదవు 'నీ వింతగా మసలి
పుట్టినాఁడ విదేమి? బుడుతఁడా! నీకు
నాయిచ్చుసిరి లేదు నా నేలయెల్ల
మున్నె భాగించితి ముష్టిచెం బూని
పోవోయి! బయటికిఁ బోవోయి!' యనుచు
వెడలింతువా బాలు వేశ్మమునుండి
యదలింతువా పాప నర్మిలి వీడి
చెప్పు ముత్తరము నా చెవులు వేచినవి"

హాలికుఁ డంతఁ బచ్చివెలగఁ దిన్నట్టు లై
కలఁగి నలఁగి హస్తములు మొగిడ్చి
"యుజ్జగింపఁ జాల నున్నంతలో వాని
కింతపాలు పంచి యిత్తు" ననియె

ఆయెడ భావే యిట్లను
"నా యాఅవబిడ్డ నేన యనుకొ మ్మిఁక నా
దాయము నాకి" మ్మన రై
తాయనఘునిమోము తెప్పలార్పక చూచెన్

అతని కా మొగమ్మునన్ దనకొమరుఁడే
తోఁచినాఁడో వేల్పె పూచినాఁడో
జంకు గొంకు లేక షష్ఠభాగము సమ
ర్పించె యతికి సభ చలించి మెచ్చ

### రా ష్ట్ర ప తి దీ వ న

బాపూజీస్మృతిచిహ్న
స్తూపము యమునాతరంగతోయార్ద్రము ని
ష్పాప మగు రాజఘట్టము
ప్రాపించె మహామహుండు భావే నియతిన్

రాజర్షి రాష్ట్రపతి శ్రీ
రాజేంద్రుఁడు వినయమూర్తి రమణీయోక్తి
భ్రాజితసత్కృతిపత్రము
నా జగదాచార్యమౌళి కర్పణచేసెన్

అది యఖండభారతార్పితసమ్మాన
మది సమస్తభారతాంతరంగ
మది గ్రహించి యోగి మృదువాక్యముల మహీ
దానతత్త్వమెల్లఁ ద్రచ్చె నపుడు

"భూమి లేదు నాకు బుడుతలపాలింటఁ
గలదు కొంత, మీకు వలసినంత
పుచ్చుకొనుఁడు దానఁ, బుత్రులు మీకడ్డు
పల్క" రనియె రాష్ట్రపతి కరంగి

ఆదానం బాదీవన
యాదేశము కాదె భారతావని కెల్లన్
దాదృశగౌరవ మందిన
సాదువినోబాజయంబు సందిగ్ధమొకో?

మంచి మేల్కొన్నది

అది గయామండలమ్మునం దలరు పల్లె
యచటు చిన్నజమీన్‌దారు నాటపట్టు
వచ్చె నట కెండవానల వండ కోర్చి
పేద కాదరువైన భావేదళమ్ము

ఆదారయాదరమున్ గని
భూదానము నడుగ మనసుపుట్టిన తత్స
ర్వోదయ సమాజసభ్యుల
కాదట నిట్లనిరి యూరియందలి మిత్రుల్

"ఈఱేఁడు తులువతనమున
నీరేడుజగాల గెల్చు; నిఁక వీని కిసీ
మైరేయమె యాహారము
వారనిజూదంబె వీనివలపై నడచున్

మీరు కా దెవ్వరైన నీక్రూరునడత
మార్పఁజాలరు వీఁ డొకమనిసి కాఁడు
రిత్తపని యేల వీని దర్శించు టుడిగి
తరలుఁడీ వేగ వేఱొకదారిఁ బట్టి"

కార్యకర్తలచేతులు కాళ్ళు చల్ల
పడియె నాసామికొంఅగానిబ్రదుకు వినఁగ
నాత్మబల మేచి యున్నయుదాత్తచరిత
విమల యొక్కర్తుకయె పట్టు విడువదాయె

ఆయమ్మ దరహాస మలర నెయ్యారను
గని పల్కె "నన్నలు! కనుఁడు సత్యమ్ము
బడలి మానవులలో భగవానుఁ జూడఁ
దలఁచి సైనించుసాధకులము మనము
పరమేశ్వరప్రేమ ప్రాప్తించుదనుక
జగదీశుపుణ్యదర్శన మబ్బుదనుక
గుడి వీడి వెలికి నేగుట పాడియౌనె?
మతిమాలి నిస్పృహ మరగుట తగునె?
మనవినోదాయుద్యమము నవ్వులాట
వంటిదా? యలఁతులవంటిదా? చెపుఁడు
తులలేని లోఁతులోఁతులఁ బాదుకొన్న
మానవతానిష్ఠ మనమూలబంధ;
మీనిష్ఠ గలప్రజ నీక్షింపకున్న
నీ నిష్ఠ గల క్రాంతి నీక్షింపకున్న
మన కేమి ఫలమయా మన కేమి బలము?
మనజన్మమున కబ్బు మాన్యత యేమి?"

ఎంత సెప్పిననేమి యాయింతిమాట
మెచ్చలేక మిత్రులు పొలమేర దాఁటి;
రొక్క విమలయె రవి సెగల్ క్రక్కువేళ
రాజభవనమ్ము సేరె ధీరత వెలుంగ

పంచలోఁ గూర్కుచున్నాఁడు ప్రభువు; తలుపు
నటునిటున్ గదలించె నాయతివమిన్న
యదరిపడి రాయఁ "డెవరువా?" రనుచు నార్చె
"నేను మీచెల్లెల" నటంచు నెలఁత నుడివె

చెల్లె లనుమాట వినుటనె
త్రుళ్లిపడెన్ రాజు వెఱ్ఱితో నెవ్వతయే
నిల్లుం ద్రొక్కెనె యని మది
కల్లోలమువోలెఁ గదలఁ గాఱియచెం దెన్

అంత విమలను జూచి యీయింతి యిచటి
కెట్లు రానేర్చెఁ గారణమేమి దీని
రాకడ; కటంచు గొణఁగి యారామ నవల
హెచ్చరించుచు నీరీతి నుచ్చరించె

"ఏను దుష్టుఁడ నూరెల్ల నెఱుఁగు నన్ను
నొక్కఁడును జెప్పలేదె నాయోజ నీకు
మంచివారికి నావంటి క్రించుతోడ
నేమిపనివచ్చు నీవు రానేల యిటకు

అదిగాక నీవు చక్కని
సుదతివి జవ్వనపుఁబెంపుసొంపులు నీలోఁ
గుదురుకొనియుండె నీ వీ
సదనము వేవేగ వీడి చను టొప్పుఁ జుమీ!"

అపుడు విమల పల్కె "నన్నయా! నాకు నీ
దుష్టమైన వృత్తితోఁ బనేమి?
ఒక్కమాట కొసఁగు ముత్తరమును నీకుఁ
దల్లిలేదె? చిట్టిచెల్లి లేదె?

ఆతల్లికి నాచెల్లెలి
కితావు స్పృశింపరాని దెట్లగు? భక్తిన్
బ్రీతిన్ వారలఁ గనవా?
నీ తులువతనమ్ము వారి నెట్టునె వెలికిన్?

ఏను నొక క్రొత్త చెలియల
నై నినుఁ గనుఁగొన్నదాన; నాచార్యవినో
బా నెఱుఁగుదువు గదా! యతఁ
డీ నేలకు వచ్చినట్టి యీశ్వరుఁడుగదా

ఆతని సందేశముతో
నీతలుపుం దట్టితట్టి నిద్ర దొలఁచితిన్
నా తప్పు లున్న సైఁపుము
నీతప్పులు నే నెఱుంగనేరను రాజా!

ఏ నూరక చనుచెల్లెని
గాను; మహీదానయజ్ఞకంకణ మిది నీ
పాణిం గట్టినవెన్కనె
పైనము సాగింతు నొండుపల్లియదెసకున్"

రాజునోట మాట రాదాయె; నతఁ డెంత
నిందుఁ డైననేమి? నేఁడు వాని
మదిని గుబ్బువెట్టు మంచి మేల్కొన్నది
బ్రదుకు మాఱె నతనిభవము మాఱె

అతనిపునర్జన్మమునకు
జతపడి యేర్పడిన పురుటిస్నానం బన సం
తతధారలఁ గోష్ణోదక
తతు లక్షులనుండి వెడలి తడిపెన్ నృపతిన్

తేఁడు విమల నాదరించెను లెంకగాఁ
జేయిమోడ్చె నా సుశీలముందు
రమ్మ తల్లి! కృపను రమ్మ లోపలి కని
పెద్దచేసి చెలికిఁ బీఁటవైచె

"నన్నుద్ధరింపఁగా శ్రీ
మన్నారాయణుఁడు పంపె మగువా! నిను నేఁ
డన్నన్న! నన్నుఁ దేర్చిన
పున్నెము నీపాలి" దనుచుఁ బొగడెను సాధ్విన్

ఊరినెల్లఁ బిలిచె నొకసభ గావించెఁ
దనచరిత్రమెల్ల వినిచి క్రుంగె
సొంతకమ్మతమున మంతుగన్న పొలంబు
పెల్లుగా నొసంగెఁ బేదకొఱకు

ఒక్కతఱి దెబ్బదిని డాఁగియుండుఁగాక
మానవునిహృదయమ్ములో మంచి కలదు
పాత్రులగువార లర్థించుపట్టునందు
నుబుకు నువ్వెత్తుగా నది యొదుఁగలేక

నా కొడుకులు సోమరులు కారాదు

అది సాగరాఖ్య మగుజన
పద; మచటన్ భూమిదానపరమార్థము కో
విదుఁడు వినోబా చాటెను
గదలెన్ దానములు విశ్వకల్యాణదముల్

ఒకముదుసలి "నాకడ నా
ఱెకరాలధరిత్రి యుండె నది పేదలపా
లికి నర్పించెద" నన "జీ
విక నీ కేది" యనె గురుండు విభ్రాంతమతిన్

"కూలిచేసి కూడు గుడ్డ నార్జింతు నీ
నేల కిచ్చినదియుఁ గూలిసొమ్మె"
యని వచించె వృద్ధః; డాచార్యుఁ "డుద్రుగా
కట్టువాండ్రు నీరుఁ గొంద" అనియె

"ఉన్నారు నాకు ముప్వురు
పిన్నలు; వారలకుఁ బంచిపెట్టను బాలమున్
నన్నుంబలె శ్రమపడి వా
రన్నము దినవలయు నిష్ట మగు నిది నాకున్

కొడుకులను సోమరులఁ జేయుకోర్కె లేని
మానిసిని నేను; సోమరి మహికి బ్రేఁగు;
మేలు కీడెల్ల నరసి యీనేల నీకు
నిచ్చుచున్నాఁడఁ గొను" మని వృద్ధు సెప్పె

ఈదానము లోకోత్తర
మీదాతను దొరయువార లెందఱు కల రం
చాదరమేదురదృక్కుల
కాదరువుం జేసి మెచ్చి రాతని సభ్యుల్

అతఁ డంధుఁడు కాఁడు

చౌదరిపురము 'మురాదా
బాదు'నకున్ జెందినట్టిపల్లియ; మన భా
వేదళ మచటికి వచ్చెను
భూదానక్రతుఫలమ్ము పూరించుటకున్

రాత్రి పదియయ్యెఁ; గార్యకర్తలు సుషుప్తి
కగ్గపడినారు శ్రమమెల్ల డిగ్గఁద్రావ;
వచ్చె నచ్చోటి కెద్దులబండి నెక్కి
రామచరణుఁడు రైతుగా బ్రదుకువాఁడు

అతని దాచెంత నున్నయూ; రర్థకామ
ములకు ధర్మువు జోడించువలెతి యతఁడు;
పాప మేనాఁటిదో కంటిపాప నణఁప
లోకమును గానఁగాలేనిచీఁ కతండు

అద్దమరేయి వచ్చె నతఁ;
డప్పుడు లేకరులందు నొక్కఁడో
యిద్దఱొ కూర్కు కుంటఁ దన
యీవికిఁ బత్రము వ్రాసి యిచ్చి యా
పెద్ద గృహమ్ముఁ జేరె; విని
పించిరి లేఖకు లీవదాన్యతన్
బ్రొద్దున లేచి యొండెడకుఁ
బోవుతఱిన్ బరమోపదేష్టకున్

అది విని భావే వ్రమాన్పడి
పిదపన్ దేఱుకొని శిష్యబృందముతో ని
వ్వీథిఁ బల్కె "నెంతయద్భుత
మిది, యంధుఁ డటంచు వాని నె ట్లందురయా!

అతఁ డంధుఁడు కాఁడు జగ
త్పిత శివుఁ డటు వచ్చె మనల దీవించుటకున్;
మతి లేనిమనమె యంధుల
మతఁడంధుఁడు కాఁడు నమ్ముఁ డతఁడీశ్వరుఁడే!"

## అల్పదాన మెట్లిచ్చెదను ?

కారుణ్యమూర్తి సేవా
భారముతోఁ దనకుఁగూర్చుపరివారముతో
గోరఖాపురమునకున్
జేరువఁ గలఘట్టమునకుఁ జేరం దొడఁగెన్

బట్టలతోఁ బాత్రలతోఁ
బెట్టెలతో శకట మొకటి వెడలెను; గుంటల్
మిట్టలు సూచించుట క
ప్పట్టున నొకరుండు నడిచె బండికి నెగువన్

హరిజనుఁ డతఁడు వినోబా
పరమోద్యమ మరసి బాగుబా గనుకొని త
ద్గురుశిష్యు నొకనిఁ గని యీ
సరణిన్ వచియించె లజ్జ సందడిసేయన్

"ఓయయ్య! మహీదానము
సేయుట కేఁ దగుదునొక్కొ! చిన్నలు పెద్దల్
మాయింటం బన్నిరువురు
పాయక తినవలయు వచ్చుబంధు లటుండన్

కొలఁదిగా నైదుబీగాలపొలము మాకుఁ
గలదు; కూలిసేయనినాఁడు కడుపు నిండ;
దగుట నీనేల మీకు నీయం దలంతుఁ
గాని యీయల్పదాన మేకరణి నిత్తు?"

అతనియడుగుఁదమ్ము లంటి భావేశిష్యుఁ
డెఱఁగె మేనఁ బులక లేసరేఁగ
“నెంతపుణ్యభూమి యీభారతము! తపో
దానములకు నిది నిధాన” మనియె

దాతతృప్తి నెంచి యాతనిభూమిలో
నించుకంత గొనె యతీశ్వరుండు
పిదప బండిదోలుపిన్న కీసంగతి
పలుకరింప వానిపండ్లు పులిసె

తన కున్న దెకర మైనను
వనరక వాఁడొసఁగె నింతవసుధను; భావే
చనుదారి నిట్లు కరుణా
వనవీథులు విరిసి దానవాసన లెగసెన్

### చావునకు భయపడను

గయకు దవ్వునందుఁ గలయొకపల్లెలో
నిలిచి యుండె గురుఁడు; నేలనాల్గు
దెసలవారు పంప దినదిన మతనికి
వచ్చు నూర్లకొలఁది వక్కాణములు

గయలోన దిగినలేఖల
రయమున బాబా కొసంగి రా నొక సేవా
మయజీవనుఁ డగుశిష్యుఁడు
పయనము సాగించెఁ బ్రొద్దు పడమటి కొగ్గన్

చనుచుండె హుటాహుటి నతఁ;
డినుఁ డస్తాచలముఁ జేరె; నిరు లాముకొనెన్;
వనమునఁ బడె శిష్యుం డపు;
డెను మని యే స్గని గణింపఁ డేకాగ్రమతిన్

అడవినడుమ దొంగ లాఁపిరి వానిని;
గ్రుద్ది రసురు లగుచు నుద్దవడిని;
బట్టుదప్పి క్రిందఁబడెఁ గార్యకర్త; త
ద్గళము నొత్తఁ దెగిరి కన్నగాండ్రు

భావేభటుఁ డపుడి ట్లనె
"నావచనం బొకటి వినుఁ డనంతరమున మీ
కేవిధిఁ దోఁచిన నావిధిఁ
గావింపుఁడు; మృతికి నేను గలఁగన్ దొలఁగన్

మీరు వినోబాకథ వి
న్నారుగదా!; వారిపని యొనర్చెద నే; నీ
చేరువఁ గలమాయొజ్జకుఁ
జేరుచుకమ్మ లివి; వీక్షసేయుఁడు మీరున్

మా కింతనొప్పి కల్గిన
మీ కెంతయు నష్టి కల్గు; మీవలె లేమిన్
జీకాకుసెందుపేదకు
మాకార్యక్రమమె శాంతిమత్త్వము గూర్చున్

మున్ను వాల్మీకి బోయగా నున్ననాఁడు
చేసె మీవలె నెన్నేని చెనఁటిపనుల
నతఁడె తుదకు రచించె రామాయణంబు
నఖిలపురుషార్థసాధనమై వెలుంగ"

సిగ్గుపడిరి దొంగ; లగ్గలముగ వారి
కనులవెంట బాష్పకణము లురలె
నొట్టుపెట్టుకొనిరి యెట్టిముప్పుల నైన
నన్యహింస నొల్ల మనుచు వారు

జే యనిరి కార్యకర్తకు
నాయడవిన్ గడచుదనుక నాతనివెంటన్
బోయిరి మన్నింపుఁడ యని
యాయయ్యకు మ్రొక్కి మ్రొక్కి యరిగిరి బోయల్

## ఇచ్చినది ముట్టను

భూదానయజ్ఞ సంపూర్తి కెవ్వాఁడు
జీవనదానమిచ్చె, నుదారచరితుఁ
డతఁడు జయప్రకాశాఖ్యుఁ డూరూర
సభలు సాగించుచు సంయమీశ్వరుని
సందేశమును లెస్స చాటుచు నొక్క
పల్లెకు వచ్చె; నేర్పడె నందు సభయు;
నావేశపూరిత మగు నుపన్యాస
మాసభన్ వినిచె మహామహుం డతఁడు;

వానివాక్కులు ప్రజావళిడెందములను
గరఁగించె; సంపన్నకర్షకుల్ పలువు
రిచ్చిరి భూముల; నీత్యాగమునకు
నలరక "భగవానుఁ డగు శాక్యమౌని
మెప్పు లందిన గయామేదిని కర్త
దానమా యిది? దీనతామగ్నజనము
నుద్ధరించుటకు నీయుడుగర చాలు
నందురా? పరికింపుఁ డన్న!" లటంచు
నమ్రతామూర్తియై నారాయణుండు
పలుక వెండియు దానపత్రముల్ దూఁకె
నార్ద్రమయ్యెను సద; స్నపు డొకమూల
శిర మెత్తి శివధరసింహుఁ డే నాఱు
బీగాలనేల నర్పించితి ననుచు
నొకకార్యకర్త పెల్లుదరి జయప్ర
కాశుతో "నితనికిఁ గల కొండ్రమెల్ల
నిదియె, సర్వ మొసంగి యితఁ డెట్లుబ్రదుకు"
నని మెల్లఁగా నాడ నది విని చకిత
హృదయుఁడై నాయకుఁ డీమహోదాత
తన కున్నపొలమెల్లఁ దలఁకక యిచ్చె
నీయీవి సమ్మాన్యమే యౌను గాని
యితఁ డేమి తినవలె నిఁక నెల్లినుండి
యిఁత డెట్లుజీవించు, నెల్లసంపత్తి
నిచ్చుఁగాక గ్రహించు టెంత యౌచిత్య?

మొక్కబీగామాత్ర మొప్పి చేపట్టి
తక్కినదెల్ల నీదాతకే విడుతు"
నని సభలోఁ బల్క నది సైఁపలేక
చిడిముడి శివధరసింహుండు లేచి
కై మోడిచి "జయప్రకాశ! నే నిచ్చి
నది ముట్ట నొల్ల, నన్నా! నీదుపల్కు
నిట నొప్పనొల్ల, నా యీ మేనిచేవ
సడలిపోలేదు, కష్టము నోర్చుఁగానఁ
గూలితో నాలితోఁ గుక్షి నిండింతు
నిన్నాళ్ళు నాసుఖహేతు వైనట్టి
యీనేల యిఁకఁ గూటి కేఁకారుననద
హాయికి నాధార మైతీరవలయు
నంగీకరింపవే యస్మదాశయము
తిరుగులే దిప్పట్లఁ దిరుగులే" దనిన
జలదరించె నొడళ్లు సభవారికెల్ల
మోఁకటిల్లెను దాతముంగడ నేత
మెలుఁగు రాల్పడ నాతఁ డిట్లాడె నపుడు
శివధరా! నీకు జేజేలు వేవేలు
శిబిగోత్రమున జనించితివి దధీచి
సంతతిలో నీవు జన్మించితివి హ
రిశ్చంద్రుకోవఁ గూరితివి రాధేయు
కుదుటఁ బుట్టితివి నీకు నెవండు సాటి?
నవ్వుచు మేనికండలు కోసి యిచ్చి

అపు డొక సంపన్నకుటుం
బపుఁజెలి తనమేనిమీఁది బంగరురవణా
లపరిమితమూల్యములు చొ
క్కపుదీవులు దూసియిచ్చెఁ గరుణానిధికిన్

'చెల్లెలా! మంచిపని యొనర్చితివి కాని
యీసమస్తము మఱలఁ జేయింపవుగద?
నిక్క మెఱిఁగింపు' మని యోగి నెమ్మి ననుడు
నతివ గరువమ్ము దొనఁక నిట్లాడె నపుడు

'చేయింపను బాబా! యిఁకఁ
జేయింపను నగల; వీనిచే దిగులు వినా
యేమెలమిన్ గననైతిని
నాయుల్లం బిపుడు శాంతినర్తకమయ్యెన్

కొంకుమాలి వీనిఁ గొనుము, లోకశ్రేయ
మునకు వెచ్చపెట్టు; మనఘ! నేఁడు
చదువు సంధ్య లేనిచానలోసైతము
పుట్టెలే! వివేక మిట్టలముగ

మాజాతి నిద్రవో దిఁక
మీజన్మముకతన మేము మేల్కొంటి; మివే
జేజేలు; మీకు మీమఖ
రాజమునకు నభ్యుదయపరంపర లగుతన్

## పంపకము

మనవినోబాకుఁ గాన్పూరుమండలమున
రెండుపల్లెల బంగారుపండునేల
ముప్పదెకరాల నిచ్చిరి గొప్పకాఁపు
లార్తజనతుష్టి వలచి లాభ్యమును గెలిచి

ఆదాతలు మే మిచ్చిన
కేదారము లుర్వి లేక కీడ్పడుప్రజకై
యీ దినమునందె పంచిన
మా దెందము లుబ్బు ననిరి మానీంద్రుకడన్

'ఏల కా దనవలయు మీాయిచ్చ' ననుచుఁ
బంపకమ్మునకుం దలపడిరి గురుఁడు
కార్యకర్తలు కంచుఢక్కాలతోడ
వీథివీథికి నీవార్త వినిచి రపుడు

దాతలు వచ్చిరి యాచకు
లేతెంచిరి సభకు నితరు లెల్లరు నోత
ప్రోతముగఁ జేరి రెన్నఁడు
నేతాదృశ మగు విభాగ మెఱుఁగ మటంచున్

నేల దున్ని బ్రదుకునేర్పు, సేద్యమ్మునఁ
బ్రీతి, లాఁతివృత్తి చేతఁగామి,
యుర్వి లేమి యెవని కుండు నతం డర్హుఁ
డనిరి పెద్ద లీవి నందుకొనఁగ

పాత్రులగువార లారెండు పల్లెలందుఁ
గలరు పన్నిద్ద అని లెక్క కానిపించె
నింటి కైదెకరాలుగా నిచ్చుపట్ల
దిగులుతోఁ బోదు రిందులో సగముమంది

ఎవని కవని యిచ్చి యెవనిని రిత్తగాఁ
బంపవలయు నన్నప్రశ్న వచ్చె
నపుడు పీఁట డిగ్గి యాచార్యుఁ డుర్వి కు
వ్విళ్లుగొనెడువారివీపు నిమిరి

అన్నలార! చిక్కు విన్నారుకద మేము
చాల మీసమస్య చక్కఁబెట్ట
నరసి యరసి యెవరు పరమదరిద్రులో
తేల్చి మీరె మాకుఁ దెలుపవలయు

అనుడుఁ గొండ్ర వడయునాసతో వచ్చిన
మాల యొకఁడు గొంతు రాలుపడఁగ
నిట్లు పల్కెఁ 'దండ్రి! యిబ్బంది నెఱిఁగితి
విన్నవింతు నేను గన్నతెఱఁగు

'నాకండల బిగు వున్నది
నాకొడుకులు బట్టకట్టినా రందఱు; మే
మేకూలికైనఁ బోయెద
మాఁకటిచిచ్చునకు లొంగ; మాఁ గాని ప్రభూ

'పాప మావృద్ధ నాకంటె బడుగువాఁడు
కూనగుజ్జుకుటుంబముతో నతండు
నలఁగుచున్నాఁడు వానికి నంజ నిండు
వలదు నా' కని యొకదీనువలను సూపె

కనులు చెమ్మగిల్లి తనువులు కాఁకర
గాయలై సదస్యులోయి! నీవు
నిక్కముగ దధీచి విక్కవు కరుణకు
ననుచుఁ బెద్ద మెచ్చి రావదాన్య

ఏలమెచ్చరు నేఁ డెంతనేల యున్న
నెంతసిరి యున్నఁ దనియనిజంతువులు జ
గాన మితిమీఱి యుండ నల్గడల నెల్ల
వాఁడు నిరవధికస్వార్థవశత నుండ

ఏలమెచ్చరు నాకంటె నితఁడు దీనుఁ
డితనివెత మున్ను తొలఁగింపుఁడీ! యటంచుఁ
బీలికల మేను గప్పినకూలివాఁడు
తేపటికి గంజిలేని దరిద్రుఁ డనఁగ

మానవత్వమునకు నానవా లితఁడు భా
రతధరిత్రి సుకృతరాశి యనఁగఁ
దారకాణ మితఁ, డుదారతా రమణీయ
మూర్తి యితఁడు విగతమోహుఁ డితఁడు

ఇతనియెడఁద పెంపు నుతిసేయుసభ్యుల
కిట్లు నుడివె సంయమీశ్వరుండు
'లెండు తమ్ములార! రం డుర్వి నొసఁగఁగా
మాటలేల పనులు మనకు వలయు

మంచిసమయ మిది సమంచితఘట్టంబు
మాటిమాటి కిట్టిపూఁట రాదు
పేద కవని పంచి బిడ్డకుఁ బా లిచ్చి
తనియుతల్లివోలెఁ దనియుఁడయ్య!

నావుడు నొకహాలికుఁడు ధ
ర్మావేశం బెసఁగ నొసఁగె నైదెకరాలన్
నా వైదు నావి యైదని
యావల భూస్వాము లిరువు రర్పించి రిలన్

'ఇఁక మువ్వురుపేదల నూ
రక పంపుట పాడి యందురా? మఱి మీ రిం
చుక మ్రొగ్గిన సర్వంబును
సుకరంబగు' నని గురుండు సూచెన్ గొలువున్

కరఁగి సన్నగారుకాఁపు లించించుక
నేల యిచ్చి; రంత 'నేల యింత
బెడఁద? లోటువడినపుడమినెల్ల నొసంగు
వాఁడనే' నటంచు వచ్చె నొకఁడు

సభ జయజయరావమ్ములు
నభమున్ వణఁకించె 'వలదు నా' కని కరుణా
ప్రభ గురిసిన పాణిసికిని
లభియించెఁ బాలమ్ము గురుతలన్ ముంచె విరుల్

అద్భుతం బుదాత్త మగు నీదృశపవిత్ర
సన్నివేశమునకు 'నన్ను మాని
వాని నుద్ధరింపవలె నన్న నిజుపేద
కాక వేఱవండు కారణంబు?

నిఱుపేద కాఁడు వీఁ డొక
నెఱదాత; భరింపరానినెవ్వం బడియున్
బెఱవానిదీనతం గని
యెరిసి యెదన్ వెన్నఁజేయ నితనిక చెల్లెన్

అచ్చమగు కర్మయోగమ్ము నాశ్రయించి
ఫలము నొల్లనియోగి నా వలయు నితని
నొల్లకున్నను ఫలము సంధిల్లి కర్త
కిహపరానంద మిడు నంట కితఁడు సాక్షి

ఇతనిలోఁ గంటి మీశ్వరు నితనిరూపు
గట్టి భారతీయాత్మ సాక్షాత్కరించె
నోట లేదిఁక సర్వోదయోద్యమంబు
సాగి సాగి సృజించులే! సత్యయుగము

## హృదయ పరివర్తనము

బలియామండలమునయం
దలరారున్ గ్రామ మొకటి 'ఆజంగడ' నా
నలఘుచరిత్రుఁడు భావే
యిలకై చనుదెంచె నటకు హితమండలితోన్

"మీరు మాపని సేయుచున్నారు, గెలుపు
వసపడుత మీకు" ననుచుఁ గాంగ్రెసును గొల్చు
వారలు, సమాజవాదంపువారు వచ్చి
యిడిరి సమ్మాననపత్రముల్ వృద్ధఋషికి

కమ్యూనిస్టులు నపుడా
సామ్యవిధారతున కిడిరి సమ్మానము; నీ
రమ్యత గని సభ ముత్సా
రమ్యము గనెఁ జంద్రుఁ జూచురత్నాకరమై

"మీదారికి మాదారికి
భేదము కల; దైన మీకు బెడఁదలు కూర్పం
గాఁ దలఁపము బాబా! యది
కా దని భావింతు" మనిరి కమ్యూనిస్టుల్

ఈ పాటి చాలులే యని
బాపూశిష్యుండు తృప్తిపడెఁ; నతఁ డవలన్
బ్రాపించె మైనపురి నా
దీపించెడిసీమ యజ్ఞదీక్షావశుఁడై

ఆమండలమునఁ గల యొక
గ్రామంబున డప్పి నణఁపఁగా నతఁ డాఁగెన్
గ్రామీణ తరుణ వృద్ధులు
ప్రేమించినభక్తి నతనిఁ జూచుచునుండన్

ఆసీమఁ జేరందినట్టి కమ్యూనిస్టు
వచ్చి వినోబాను మెచ్చి వినయ
వినమితగాత్రుఁడై తనవంతుకాన్కగా
నిచ్చె బీదలకు రెండెకరములను
మునుముందు మీయత్నమున కండగా నుందు
నమ్ముఁడా! యని యతి కిమ్ము గూర్చె
నితఁడు పాలివాలు; కృతమతు లీదృశుల్
పలువురు భావేతపమ్ము పండ

నగ్గలిక చూపి; రార్తసేవానురక్త
మతికి నెవ రడ్డుసెప్పెద; రతనిబాట
నిర్నిరుద్ధము; వానివాణికి సమస్త
లోకము విధేయమై భక్తి మోఁకరించు

## ఎవరింటికి?

కమ్మతీఁ డతండు గయసీమవాఁడు వా
ర్ధకభరమ్ము హెచ్చి దయ్యెవాఁడు
దీనజనులఁ దేర్ప దీక్షితుఁ డైన మ
హర్షి జయము కోరునట్టివాఁడు

అతఁడు తనమండలమ్మున
యతి యున్నాఁ డన్నవార్త నాలించి సమా
హితచిత్తవృత్తిమైఁ జని
యతిలోకచరిత్రుఁ గాంచి యాదట మెచ్చెన్

మెచ్చి యపారక నిచ్చెనా యిచ్చెఁ దనదు
నవనియెల్లను విశ్వకల్యాణమునకు
నదియు ముక్కారుపంటల కనువు గలది
యదియు నర్వదియెకరాలయవధి గలది

అతనిదానధార యామాత్ర నాఁగెనా
పండ్లతోఁట దెసకు బావి దెసకుఁ
జక్కఁ గట్టినట్టి సౌధమ్ము దెస కాల
దెసకు దుక్కిటెడ్ల దెసకుఁ జనక

పూచికపుల్లయుఁ దన కని
దాఁచెనె సర్వస్వ మిడె నతం డార్తులకుఁ; కా
శౌచనిధి నాఁటినుండియు
నాచార్యునిపజ్జఁ దిరుగ నారంభించెన్

కడచె దినములు వారముల్ కడచె నెలలు
గడచె; నవ్వేళ నొకకార్యకర్త యతని
"నిచట నెన్నాళ్ళు నిల్చెద వింటి కేగు
టెప్పు"డని ప్రశ్నసేయఁగాఁ బిట్లు నుడివె

"ఇంటికా యెవరింటి కి దేమి ప్రశ్న
కలదె నా కిల్లు వాకిలి కలదె కొండ్ర
యిచ్చు వచ్చినయన్నినా ళ్ళిచట నుందు
గురుని సేవించుకొందు నీశ్వరుని గందు

నాయుల్లము తనిసిననాఁ
డేయెడకో పోదుఁ గాని యే నెన్నఁటికిన్
డాయను ముట్టను మెట్టను
నాయిచ్చిన మందిరమును నంజను బుంజెన్"

బుడుత డస్సి డస్సి బొమ్మరిల్లు సృజించి
యంతలోన దాని నణఁచినట్లు
సిరులు కూర్చి కూర్చి తటేఁజూచి విడిచిన
మేటిదాత కితని కేటికోళ్లు

అవ్యక్తమే గొప్పది

సురభి యను వీటికిం జనె
గురువర్యుఁడు; వారు వీరు కూడిరి పౌరుల్
మరియాదలెల్ల జరిపిరి
పరమర్షి కి నార్తలోక బాంధవమణికిన్

దేశికుఁ డుర్వీదాన
ప్రాశస్త్యము నుగ్గడించెఁ బ్రార్థన వేళన్;
దేశముఖు లెందఱో విని;
రాశయ మిది చాలమంచి దని రుత్సుకులై

ఉచ్చండమైన మేఘము
వచ్చి తుషారంబె రాల్చి వాసినభంగిన్
మెచ్చి కడుమెచ్చి సభవా
రిచ్చినపొలమెల్ల నాలుగెకరాలె చుఁడీ!

అచటి కామడదవ్వునం దలరు నూర
నున్నకర్షకు లిద్ద ఱాపన్నహితుఁడు
వచ్చె ననువార్త విని మేఁడి వదలి కదలి
సురక్షికిం జేరి బాబాను జూచి మ్రొక్కి

నలువదినాల్గెకరమ్ముల
పొల మిడి తమపల్లె కపుడ పోయిరి; భావే
పలు కెన్నఁడు నాలింపని
హాలికులు వీ రింతయొసఁగ, నార్భాటమునన్

సభకు వచ్చి యాలించినజనులు పుడమి
నెంత యొసఁగిరి? మన కిది వింత; కాని
వ్యక్తమునకంటె నవ్యక్త మధిక మన్న
తత్త్వ మెఱిఁగించె నపుడు విద్వత్ప్రభుండు

### కీర్తికాంక్షలేదు

విదుషి సత్యబాల వెడలె భావేయజ్ఞ
కార్యనిరతి నొక్క గ్రామమునకుఁ
గండపట్టినట్టి కమ్మతీండ్రకు నది
మనికిపట్టు సిరుల కునికిపట్టు

భూదానమహత్త్వము నా
సోదరి వివరించి పల్కుచోఁ గీరితిపై
నాదటపడి దానం బిడఁ
గా దని యది సాత్త్వికమ్ము కా దని చాటెన్

ఇచ్చువాని కహంకృతి పుచ్చుకొనెడి
వాని కిసుమంతదైన్యము లేనియీవి
యుత్తమోత్తమ మని పల్కె నువిదమిన్న
సభ ముగిసెఁ గాని దానవాసన హాళిక్కె

ఈపూఁట పేరుకొన్నను
జే పీ డెందములు కరఁగి ప్రేమస్రోతో
రూపము ధరింపవా యని
యాపొలఁతుక బసకుఁజేరె నాఱనిదీక్షన్

అంత నొకవృద్ధకర్షకుఁ డావెలంది
కుఱఁగటికి వచ్చి యణఁకువఁ గురిసి 'నేను
నలువదెకరాలవాఁడ నానంజ పుంజె
ఎల్ల నిచ్చితిఁ గైకొమ్ము తల్లి!' యనియె

ఆసాధ్వి విస్మయంపడి
యీ సత్కృతి సేయవైతివేమీ సభ నాఁ
గానంతయశము నొల్లని
మాసి యితం డనియెఁ గాఁపు మానిని క్రుంగెన్

ఫలము నొల్లనికర్మమే వలఁతిచేఁత
గీత సెప్పిన వెలలేనినీతి యిదియె
విశ్వహితశీలుఁ డైన భావేమహర్షి
కతన నీయోగమునకు సంక్రాంతి వచ్చె

### గ్రా మ దా న ము

'మంగరౌటు' హమీర్పురమండలమునఁ
జెలఁగునొకయూరు; శత్రుఘ్నసింహుఁ డచటి
ప్రజలకై తనబ్రదుకెల్లఁ బంచిపెట్టి
యాడిగముసేయు నుత్సాహ మురవణింప

ప్రతిజాతీయోద్యమమున
నుతిగనె నాపల్లె; యిఁక వినోబాక్రతు వి
స్తృతి కిది సాయంపడు ట
ద్భుతమా? లోకైకదానధూర్వహ మగుచున్

'వచ్చుచున్నాఁడు భావేప్రవక్త' యన్న
వార్త వినినంత నాయూరివారు కదలి
యెదురుచని తోడితెచ్చి ఋషీంద్రుమెచ్చ
యిచ్చి రణఁకువ మీఱ నూఱెకరములను

ఆదానము గైకొనుతఱి
నేదో భావించి యోగి యిట్లను 'నయ్యా!
మీ దాతృత్వము జగమున
కాదర్శం బగువిధమ్ము నరయుఁడు మీరల్

ఇంచుకించుక పుడమి నా కేల యిత్తు?
ఊరఁ గలకొండ్ర యంతయు నూరిపాలి
నేలగాఁ జేయరాదె? యీ నిర్ణయంబు
సముచితము కాదె! కనుఁ’ డంచు సాగిపోయె

ఇచ్చితి మను సంతోషము
విచ్చెను గ్రామీయులకు; వివేకము, త్యాగం
బుచ్చైర్దశకుం జనఁగాఁ
బ్రచ్చిరి వా రపుడు ధర్మతత్త్వము నెల్లన్

లోకోత్తర వితరణమున
కీకొనిరా ప్రజలు; సంయమీంద్రునికడకున్
దూఁకి; రిదె గ్రామదానము
గైకొనుఁ డని పత్ర మిడిరి కరుణానిధికిన్

ధర్మము జయించెఁ, దనిసె సత్యమ్ము, పట్టి
భద్ర యయ్యె నహింస, విశ్వము వినూత్న
యుగమునకు వచ్చె ననె యోగి, సొగసి రచటి
పారిషదులు, చల్లనిగాలిఁ బంచెఁ బ్రకృతి

ఆదర్శ గ్రామముగా
నేదిగు లేనెగులు లేని యిలగా భావే
యాదరమున నేర్పడఁగా
రాఁదొడఁగెన్ జగము మంగరౌటును గనఁగా

ఏమి? మంగళాటులో మనవంటి మా
నవులు గాక వెలసినారె సురలు
ప్రజల దిద్దితీర్చు బంటు శత్రుఘ్నుఁ డా
యూర నుంట నిట్టిమెఱపు వచ్చె

నేల లేనివాఁడు నేఁ డొకఁడైన న
చ్చోటఁ గానరాఁడు, కూటికొఱకు
నొరుల దేవురించునరుఁడు లేఁ; డానంద
సదన మెల్లవానివదన మచట

నలువదెకరాల వానికి నాలు గిచ్చి
సంతసము గూర్చుశక్తి యేచట్టమునకుఁ
గలదు? ప్రేమశాసనమె యీయెలమి నొసఁగు
వలఁతియై చెల్లు; దీనికి వందనములు

లోక మిది మారకాస్త్ర వి
షాకీర్ణం బైన నేమి? యపు డామిత్రిన్
డీకొనుఁ బ్రేమతరంగము
లాకసమున కెగసి మెఱపులై దొంతరలై

ప్రాదుర్భవింపవలె స
ర్వోదయరాజ్యమ్ము; పండియున్నది మహి; నేఁ
డాదేష్ట వచ్చె; శౌచ వి
ఖాదీప్తము కార్యకర్తృవర్గమె వలయున్

## రామగంగాస్మరణము

మొదటిదాత జన్మమున కాదిహోతాత యూ
కాఁపుఁ జూడ జగము కదలె; నైన
నొక్కసారి యిచ్చి యూరకుండఁనె రామ
చంద్రరెడ్డి యీవి నింద్రుగిడ్డి

ఇచ్చెను జయప్రకాశుఁడు
వచ్చినతటి నుర్వి; కేశవసుధీమణి రా
నిచ్చె మహి; పెద్దలెవ్వరు
వచ్చిన రిత్తగ నితండు పంపఁడు వారిన్

ఓలి నోలి నొసఁగె నాలుగువందల
యెకరములపొలమ్ము; నిపుడు రెడ్డి
యనుభవించునేల యెనుబదియెకరాలె
యెల్లి దీనిమేర యెంతడిగునొ

మొన్న నొకకమ్మఁ బంపె నాపన్నలోక
బాంధవుఁడు రామచంద్రునిపాలి కర్థి
నది పఠించినరెడ్డి నెయ్యమునఁ బిలిచి
యూరివారికి వినిపించె నొజ్జపల్కు

ఆపలుకు గ్రామదానంబు నొసచేయు
పలుకు రడ్డిని దనిపెడిపలుకు; కాని
కాఁపులందఱు మెచ్చినఁగాక యిది ఫ
లించునా రామచంద్రుఁ డగ్గించినంత

కావున నతఁ డాసభలో
నీవిధి వచియించెఁ' గ్రాంతి యిది మంచిది,మీ
భావము లనుకూలమ్ములు
కావలయును దీని, కేను గర్వింప మిమున్

అన్నలార! తడవుఁ డోగాము లాశుభ
వేళకొఱకు నేను వేచియుండు
నంతదనుక నాకు నబ్బెడిపంటలో
షష్ఠభాగ మిత్తు సవనమునకు

మఱియు నీయుహారిసేవకై మామకీన
జీవితము నేఁటినుండి యిచ్చెద; మదీయ
జాయ తలఁ పెట్టిదో' యన నాయుదాత్త
చరిత నిలఁబడి సభకు నంజలిఘటించి

'సీతవోలె రాముఁ డేతెంచుబాటలో
నడుగువైతు నింతి కర్తమిదియె'
యనుచు రచ్చపొంగె; నాఱవపా లుర్వి
యిచ్చి రెల్లకాఁపు లిచ్చగించి

మనఋషికి మున్ను టెంకాయమాత్ర మిడిన
శాస్త్రి మెన్మిదియెకరా లొసంగె నేఁడు
మంచిదె! పునాసకాపు వక్రించుఁగాక
చాలదా పైరపంట లెన్నగ ఫలింప

కమ్మఁ దెచ్చిన యోగీంద్రుకార్యదర్శి
భూమిపుత్రులఁ జూచి భావేమఖార్థ
మంతయో యింతయో మీరు నర్హదాన
మీయవచ్చు ననన్ వార లివతళించి

'మా కలవియైన దేదో
వాకొనుఁ' డన 'మీరు కల్లు వదలమి వింటిన్
నాకీవ్యసనము నిం డిది
లోకోత్తరదాన' మనుపలుకు నతఁ డాడెన్

హరిజనులు కల్లుసారాల నంట మనుచుఁ
బ్రతినచేసిరి, పోచమపల్లిలోన
మూఁతవడె మద్యశాల, యీరీతి నిత్య
నూత్న చైతన్య మాయూరు నూలుకొల్పు

---

# పేదలం

"ఆత్మవత్సర్వభూతాని" యన్న పలుకు
మనది "సహనౌభున" క్తన్న మినుకు మనది
బోయ కాతిథ్య మిచ్చినపుల్గు మనది
శాంతికై మీఁదుకట్టిన జగతి మనది

ఎముకలగూఁడులై బ్రదుకు
నీడ్చుట కొల్లక త్రెళ్ళలేక శో
కములఁ దపించుచున్ సెగలు
క్రక్కు దరిద్రులఁ ద్రోసిపుచ్చ కా
లము చనె, విప్లవాగ్ని దెస
లన్ గబళింపకముందె యందలా
లమరినవారు మేల్కొని య
హంకృతి నుజ్జనసేత లగ్గగున్

'నేను' విడిచి 'మనము'పై నిచ్చ నిడనిచో
దేశ మెక్కిరాదు లేశమేని
క్రొత్తకలద గాదు ముత్తాతలే యిది
చెప్పినారు కన్నువిప్పినారు

చదువు లేక గ్రుడ్డిబ్రదు కీడ్చు మానిసి
మందు లేక రుజలఁ గుందు పేద
కూడు లేక రాలువాఁ డున్నగడ్డకు
శాంతి లేదు జీవకాంతి రాదు

పో మెఱుఁగక బా మరయక
వేమఱు చెమరోడ్చువారు వెడపొట్టలతో
నేమహి నుందురు తన్మహి
పోషించుట కల్ల నిత్యశోభావృతమై

ఆఁకొన్న పండితునిగతి
ప్రాకెన్నలవిందు లుఱని పామరుచందం
బీకొన్న రాష్ట్రి మేటికి
లేకున్నఁ గొఱంత లేవి లేచున్ వేఁచున్?

తెగఁదిని తెగుళ్లఁ బడి మూ
లుగువారున్ మెతుకు లేక లోఁచెడి చెడి నీ
లుగువారున్ మనకంటికి
నగపడఁ జెల్లదు స్వతంత్ర మగు దేశమునన్

పోలుచుఁ గూలికి నేగిన
మాలెత పొలమందె గొబ్బిమండలనడుమన్
బాలకుని గనియె నతఁ డీ
నేలకుఁ బిడుగో వచింపు నిక్కపునిసుఁగో?

నెలలు నిండి రొప్పునెలఁతను వరికోఁత
కంపురాజ్య మెట్లు పెంపువడయు
మాట లేల మన సమాజవ్యవస్థలో
మార్పు వలయు దిద్ది తీర్పు వలయు

సంపన్నులు తమబంగరు
గంపలకున్ దాము ధర్మకర్తల యని భా
వింపవలయుఁ బేదలసిరి
పెంపవలయుఁ ద్రుంపవలయుఁ బిసిడితనమ్మున్

తనివి నతకరింపఁ దగుకల్మి, పిసినారి
తనము నతకరింపఁ దగినలేమి
లేమి నిక్క; 'మానులే!' యనుచున్ నరుఁ
డిచట దారిదప్పు నెంతవెడఁగొ

ఉన్నవారు తెల్వి యున్నవా రగుచు స
ర్వోదయమ్ము దెసకు నొగ్గరేని
లేనివారు తాల్మి లేనివా రగుచుఁ దీం
డ్రింపఁగలరు కట్లు ద్రెంపఁగలరు

గజగజతో నెడచిక్కని
గజిబిజితోఁ బ్రాపులేని కాఁపురములతో
గిజగిజలాడిన ప్రజలే
నిజమైన జగచ్చరిత్ర నిర్మింతు రయా!

నరుఁడు తెచ్చిపెట్టినది గాన లేవడి
యతని కణఁపరాని దగుట యరిది
యిది యెఱింగి సిరుల నేలుదొరల్ పేద
లెదురకుండుమేర నొదుఁగవలయు

భూదానయజ్ఞ మని గురు
పొదులు దేశాలుపట్టి బడలుట విలయాం
భోదము గర్జింపమికే!
పొదులుచెడి సంఘ మార్తిపడకుండుటకే!

---

## క్రొత్తసంక్రాంతి

ఏఁటి కొక్కసారి యేతెంచుసంక్రాంతి
యుగయుగాలనుండి యున్నకాంతి
యెన్నినాళ్ళు దీని మన్నించు లోకమ్ము
ప్రాఁతవడియె దీనిప్రాభవమ్ము

పూఁట కొక్క సారి పొడతెంచుసంక్రాంతి
కెదురుసూచుచున్న దీజగంబు;
ఇనకరాళివోలె నింటింట వెలయు సం
క్రాంతి వలయు లోకశాంతి కిపుడు

లోభము నశించి భయము మది లుప్తమై స
మస్తహృదయాంతరములఁ బ్రేమప్రవాహ
వీచికామాలికలు పొంగువేళ నొదవుఁ
గ్రొత్తసంక్రాంతి యిది శుభోదాత్త మగుచు

బాపూ వలచినపండువు
పాపంబులనెల్లఁ దూల్చుపండువు భావే
శ్రీపదయాత్రాతపమున
రూపెత్తెడిపండు విది నిరూఢం బగుచున్

భోగిమంటలందు గోఁగుఁబుల్లలఁ గాదు
కామరోషములను గాల్పవలయుఁ
గ్రొత్తపబ్బమందుఁ గోడిపుంజులఁ గాదు
దురభిమానములను ద్రుంపవలయు

నూఱుమతము లైదునూర్ల కులమ్ములు
వేయి తెగలు రెండువేలనడత
లైదువేలబాస లార్వేలవేసాలు
లేనిపండు విది ఫలింపవలయు

బిచ్చగాఁడులేని ముచ్చులేని కటారి
లేని దొరతనమ్ములేని కుట్ర
లేని యారసమ్ములేని దేశావధి
లేని పండు విది ఫలింపవలయు

చూరునీటిచోటు మూరెఁడా? జేనెఁడా?
తీర్పుసెప్పఁ డనుచు దెసలుపట్టి
కోర్టువెచ్చమునకుఁ గొంప నమ్మెడిమూర్ఖు
లేనిపండు విది ఫలింపవలయు

మేడప్రక్క గుడిసె మేలిమిబంగారు
పట్టువలువసరసఁ బ్రాఁతగోఁచి
తనివిచెంత నింత తఱుగని కన్నీరు
లేనిపండు విది ఫలింపవలయు

కుక్కలను గదల్చి ముక్కడిపండుల
మందలించి కడుపుమంట లార్ప
నెంగిలాకు నాకు నేనాదిమూఁకలు
లేనిపండు విది ఫలింపవలయు



రచన: ౧౯౫౭ - ౬౦

# అర్థములు

క్షోణి – ధ్వనించునది

వెలదిపల్కు – శుద్ధమైన వాక్కు

ఆదిత్యపురి – సూర్యాపేట

క్రించు – నీచుడు

బీగా – 63 సెంట్లు

కూరితివి – పుట్టితివి

పాణసి – మాల

ముత్పారమ్యము – సంతోషాధిక్యము

కమ్మతము – సేద్యము

కమ్మతీడు – సేద్యగాడు

నంజ – మాగాణి

పుంజె – మెట్ట

పటికోళ్లు – నమస్కారము

కాదు – తగదు

భూమిపుత్రులు – హరిజనులు

మీదుకట్టుట – ముడుపుగట్టుట

సోము – సుఖము

సోమించుట – వృద్ధిచెందుట

ప్రాకెన్న – సదస్యము

ఉజని – లెక్కసేయని

పిసిడి – లోభి

అతకరింప – తిరస్కరింప

అరిది – అశక్యము

# సవరణలు

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 14 | 16 | వెజు | వెజ్జు |
| 29 | 1 | బరుపు | బరువు |
| 33 | 1 | సేవ | చేవ |
| ,, | 7 | తలచు | తలంచు |
| 35 | 10 | బుదుఁడు | బుద్ధుఁడు |
| 45 | 14 | నమస్త | సమస్త |
| 50 | 1 | చెల్లైని | చెల్లని |

# మా కృతులు

౧ బాపూజీ ఆత్మకథ ౨ పఱిగపంట ౩ ఆత్మార్పణము ౪ ధర్మజ్యోతి
౫ గీతాంగళము ౬ శబల ౭ రాష్ట్రగానము ౮ ఉదయగానము
౯ సర్వోదయగానము ౧౦ తెనుఁగుపీఠి

రానున్నవి

౧౧ పైరపంట ౧౨ మహాత్మకథ


తుమ్మల సీతారామమూర్తి
అప్పికట్ల P.O.
Via బాపట్ల, గుంటూరుజిల్లా